# కామధేనువు - కనికరించిన వేళ





భావానువాదం :

డా॥ మోపిదేవి కృష్ణస్వామి,

ఎం. ఎ., పిహెచ్ డి.

ప్రచురణ :

దీ యూనివర్సల్

హ్యూమానిటేరియన్ ఎడ్యుకేషన్ ట్రస్ట్

ప్రథమ ముద్రణ :

మేకాల్ గురుపూజలు - 1989

విజయవాడ

ప్రతులు : రెండువేలు



వెల : రు. 10-00



ప్రతులకు :

ది యూనివర్సల్ హ్యూమానిటేరియన్ ఎడ్యుకేషన్ ట్రస్ట్

16-8-1

అఫీషియల్ కాలనీ

మహారాణీపేట

విశాఖపట్నం - 2

23-10-7

పురుషోత్తం వీధి

సత్యనారాయణపురం,

విజయవాడ-11

ముద్రణ : అనిలా ప్రింటర్స్,

విజయవాడ-2.

ముఖచిత్రం : బాలి.

# కోరిక ఫలించింది

మనలో మహాకవి కాళిదాసుని గూర్చి ఆయన రచనలను గూర్చి తెలియని వారుండరు. కారణమేమంటే ప్రపంచ సాహిత్యంలో ఆయన స్థానం అంతటిది. ఆయన కవులకు కవి. కవికులగురువు. కవి అనగానే మన మనస్సులకు మొదట గుర్తుకొచ్చేది ఆయనే. వాల్మీకి, వ్యాసులు కవులయినా వారిని మనం మహర్షులనే అంటాం.

కాళిదాసు రచించిన పెద్ద కావ్యాలు రెండు అవి రఘువంశం, కుమార సంభవం. చిన్నకావ్యాలు రెండు. అవి మేఘ సందేశం. ఋతుసంహారం, నాటకాలు మూడు. అవి అభిజ్ఞానశాకుంతలం. విక్ర మోర్వశీయం. మాళవికాగ్నిమిత్రం. సంస్కృతంలో పంచమహా కావ్యాలుగా చెప్పబడేవి రఘువంశం, కుమారసంభవం, మేఘసందేశం శిశుపాలవధ, కిరాతార్జునీయం. ఈ ఐదింటిలో మొదటి మూడు కాళి దాసు రచనలే కావడం విశేషం.

మానవుడికి ముందడుగు వేయడానికి కావలసిన ధర్మపథాన్ని, దివ్యజ్ఞానాన్ని, సూటిగా వివరించేవి వేదోపనిషత్తులు. ఆ రెండింటిని మనకర్థమయ్యేటట్లుగా వివరించి చెప్పేవి పురాణేతిహాసాలు. కాంతాసమ్మితంగా రసవత్తరంగా, అనుభూతి ప్రదంగా, ఆరెండింటినీ అందించేవి కాళిదాసు వంటి మహాకవుల కావ్యాలు.

శ్రుతి స్మృతులు అంటే వేదము, ధర్మశాస్త్రము. ఈ రెండింటిలో ఏం చెప్పబడిందో మనకు బోధపడెటట్లు చేసేది పురాణ ఇతిహాసాలు. ఆ పురాణేతిహాసాల బోధను అందంగా మనహృదయాలకు హత్తుకు

పోయేటట్లుగా, అందించగలిగినవి మహాకవుల కావ్యాలు. రఘు వంశం అలాంటి కావ్యాల్లో చాలా దొడ్డది అని చెప్పవచ్చు. ఇది దిలీపుని చరిత్రతో ప్రారంభించి సూర్యవంశపు రాజులలో ప్రధానులైన అందరి చరిత్రలను వర్ణించి చెబుతుంది. ఇలా వంశచరిత్రను కావ్యంగా వ్రాయడానికి వెనుక కాళిదాసు మనస్సులో ఒక సూక్ష్మాంశం దాగి ఉంది. అదేమంటే మానవులకు అందవలసిన ధర్మసూక్ష్మాలూ, సద్గుణాలూ అందింపబడాలీ అంటే ప్రత్యేకించి ఏ ఒక్కరి కథ వ్రాసినా చాలదు. కారణం ఆ కథానాయకుడు ఎంత గొప్పవాడైనా అతడి జీవిత సన్నివేశాలలో ధర్మానికి సంబంధించిన కోణాలలో కొన్నే ప్రస్ఫుటం కావడానికి వీలవుతుంది. మరిమిగిలిన కోణాలు? ఇవన్నీ ఆలోచించి ఆయన రఘువంశపు రాజుల కథలను తీసుకొన్నాడు. ఒకొక్క కథకు కొన్ని కొన్ని కోణాల చొప్పున ప్రస్ఫుటం అవుతూ ఉండగా కావ్యం పూర్తయ్యేటప్పటికి ధర్మస్వరూపం సమగ్రంగా చదువరికి అనుభవం లోనికి వస్తుంది.

రఘువంశంలోని మొదటి రెండు సర్గలలో ఆయన దిలీపుని చరిత్రను వర్ణించాడు. ఈ కథలోని మాధుర్యం ఇంతింతని చెప్పలేం. ఆ మాధుర్యాన్ని అనుభవిస్తూ ఉండగా మనకు అనుభవంలోనికి వచ్చే ధర్మస్పర్శ యొక్క వైభవంకూడా ఇంతింతని చెప్పలేం. భగవద్గీతలో స్థితప్రజ్ఞుని లక్షణాలు వర్ణింపబడతాయి అవి ఈ కథలోని దిలీపునిలో చక్కని సమన్వయంతో దర్శనమిస్తాయి. అలాగే దిలీపుడు వశిష్ఠుని సమీపించినవేళ గురుశిష్య సంబంధంలోని వైభవం మనలను కదిలించి వేస్తుంది. కరిగించి వేస్తుంది. ఆపైన సంతతి గలుగక పోవడానికి కారణం తెలుసుకొని అతడు కామధేనువు పుత్రిక అయిన నందినిని సేవించే ఘట్టంలో ఎన్నెన్నో అపురూపమయిన దృశ్యాలు. సేవ

చేయడమంటె ఎలాగో సేవకునిగా సార్ధకతను పొందడమెలాగో ఈ ఘట్టాలను చదివి తెలుసుకొని తీరాలి. ఘట్టాలను చదువుతూ ఉండగా మనస్సు ఒకపక్క కరిగిపోతూ ఉంటుంది. ఒక ప్రక్క వెలిగిపోతూ ఉంటుంది. కరుగుతూ వెలుగుతూ వెలుగులో కరుగుతూ తానేవెలుగై వెలిగిపోతుంది. ధర్మాన్ని అంత అందంగా, అంత ఆర్ద్రంగా, అంత అనుభూతి ప్రదంగా అందించిన కాళిదాసుకు జోహార్లు అర్పించడం తప్ప ఏం చేయగలం. ఏమివ్వ గలం. ఏమీ చెయ్యనక్కరలేదు. ఏమీ ఇవ్వనక్కరలేదు. ఆయన కావ్యాలను మనం శ్రద్ధగా చదువుకుంటే చాలు ఆయన సంతోషిస్తాడు. తాను పెట్టిన ఆహారాన్ని బిడ్డ తృప్తిగా తిన్నప్పుడు తల్లి ఎంత సంతోషిస్తుంది? మహాకవులకు మనతో ఉన్న సంబంధం అటు వంటిదే!

కాళిదాసుని కృతులకు పద్యానువాదాలు ఎన్నో వచ్చిఉంటాయి. అలాగే వ్యాఖ్యానరూపంలో కూడా ఎన్నో వచ్చిఉంటాయి అలాగే తాత్పర్య రూపంలో కూడా తెలుగులో వచ్చినవి చాలానే ఉన్నాయి. ఇప్పటి ఈ రచన వారందరి కృషులను మేళవించుకొనిన ఒక క్రొత్త ప్రయోగం. కాళిదాసుని సమీపించడానికి దారులు వేసిన వారందరికీ వినమ్రుడనై కృతజ్ఞతలు తెలియచేసు కొంటున్నాను.

దీనిని తాత్పర్యమనడానికి వీలులేదు. కేవలం అనువాదమనడా నికీ వీలులేదు. ఇది భావానువాదం. కాళిదాసు కవితాహృదయాన్ని తెలుగులో ఆవిష్కరింపజేసేటందుకుగాను జరిగిన ఓ చిన్న ప్రయ త్నం. కథ కాళిదాసుని శ్లోకాలరూపంలో ఒక పక్క నడచిపోతుండగా మరోపక్క అందరికీ అర్థమయ్యే తెలుగు వచనంలో సాగిపోతూ ఉంటుంది. ఇటు సంస్కృతంలోనూ, అటు తెలుగులోనూ, ఆనందంగా చదువుతూ సాగవచ్చు లేదా దేనికదిగాను చదువుకోవచ్చు. చదువరి

సాఫీగా ముందుకు సాగిపోవచ్చు. అతడి అనుభూతి మధ్యలో ఏవిధంగానూ అడ్డుకోబడదు.

సర్వసామాన్యంగా సంస్కృత కావ్యాలను తెలుగులో అనువదించేటపుడు ముఖ్యంగా తాత్పర్య రూపంలో వ్రాసేటప్పుడు అందులో సంస్కృతపు ఛాయలే ఎక్కువచోట్ల కనబడుతుంటాయి. సంస్కృత వ్యాకరణానికి సరిపెడుతూ వ్రాసుకుంటూ వచ్చినట్లుగా ఉంటాయి. దానివల్ల చాలాచోట్ల వ్యాకరణానికి న్యాయం జరుగుతుంది. కవికి మాత్రం అన్యాయం జరుగుతుంది అనువాదంలో మూలంలోని "గ్రామరు" మిగిలి "గ్లామరు" నిష్క్రమించిన చోటులు కూడ ఎన్నో కనబడుతుంటాయి ఇంతేగాదు రచయిత వ్రాసింది చదువరికి అర్ధమయ్యేలా చెబుతున్నారు తప్ప రచయితను రచయిత హృదయాన్ని, ఆ రచనా సౌలభ్యాన్ని అందించేప్రయత్నం అంతగా జరుగకపోవడం చాలాచోట్ల కనబడుతూఉంటుంది.అనువాదాలుచేసేవాళ్ళు కేవలం విద్యార్థులను దృష్టిలో పెట్టుకుని చేయడంకూడా ఇలా జరగడానికి ఒక కారణం కావచ్చు. కాని మనం ఒకటి గుర్తుంచుకోవాలి మహాకవులు కేవలం విద్యార్థులను దృష్టిలో పెట్టుకొని కావ్యాలు వ్రాయలేదు, మానవులందరినీ దృష్టిలో పెట్టుకుని వ్రాసారు. తరతరాల మానవులకోసం శాశ్వతమైన ప్రయోజనాన్ని ఉద్దేశించి వ్రాసారు. ఆదృష్టితో చూచినపుడు మహాకవుల రచనలను మానవులందరికీ అందించే ప్రయత్నాలు ముమ్మరంగా జరుగవలసి ఉంది. పెద్దలకూ సంస్కృతికీ ప్రజలు దూరమవుతున్నారనుకుంటున్నాం. అలా దూరం కావడానికీ ఈ పైన చెప్పుకుంటూ వచ్చిన అంశాలుకూడా కొంత కారణం అని చెప్పక తప్పదు. గతానికి వర్తమానంతో అను సంధానం చేస్తూ జాతిభవిష్యత్తుకు బాటలు తీర్చటంలో రచయితల పాత్ర ఎంతైనా ఉంది.

ఇన్ని విధాలుగా ఆలోచించిన మీదట జరుగవలసిన ఆ కృషిని కవికులగురువును తెనుగున అవతరింప చేయడంతో ప్రారంభించాలని పించింది. సామాన్యంగా మూలంలోని సౌందర్యం అనువాదంలోనికి రావడమంటే అందులోనూ కాళిదాసువంటి వారి విషయంలో రావడమంటే అది కష్టసాధ్యమైనపనే. అది మనకున్న ప్రజ్ఞాపాటవాలనుబట్టి జరిగే పనికాదు, కాకూడదు ఆమహాకవియొక్క అనుగ్రహ ఫలంగా అది జరగాల్సిందే. అపుడె అది సాధ్యం. ఆయన దిగిరాదలచుకుంటే ఈ దేహం ఆయనకు వినియోగపడుతుంది, అది జరగాలి, అందుకే మహాభారత అనువాదానికి శ్రీకారం చుడుతూ తిక్కనగారంటారుకదా: "వేదవ్యాసుని దివ్యవైభవం, వరించిన, ఆవరించిన, చిత్తంతో ఈ రచన జరుగుతూ ఉన్నదీ–" అని నేనూ మహాకవిని అదే కోరాను." తరతరాల తెలుగుప్రజలు చదువుకుని తరించేటందుకు వీలుగా తెలుగులోనికి అవతరించవయ్యా అని ఆయన నా వేడికోలుకు అంగీకరించినట్లయింది. మొదటి రెండు సర్గలూ ఒక ప్రత్యేక గ్రంథంగా సిద్ధమైనాయి. "కామధేనువు కనికరించిన వేళ" అని పేరు పెట్టబడింది. అలాగే ఆయనను కోరినట్లే గ్రంథం రూపుధరించి మీ చేతులకు అందుతోంది. అందుకు నిమిత్తంగా వినియోగపడిన నాకు జరగవలసిన పని ఒకటి జరుగు తున్నదికదా అని తృప్తిగా ఉంది. అదిగో శబ్దార్థాలను పార్వతీ పరమేశ్వరులుగా దర్శనం చేస్తూ వారి అనుగ్రహంతో వేదార్థ ప్రతిపాదకమైన ఈ దివ్య గాథను రసవత్తరంగా వినిపిస్తున్నాడు కాళిదాస మహాకవి. ఇక అవధరించండి.

విజయవాడ
25-5-89

మోపిదేవి కృష్ణస్వామి.

# తప్పులు - ఒప్పులు

| పేజీ | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 27 | 15 | నిర్వారి | నివ్వారి |
| 33 | 9 | మహాకర్తా | హోమకర్తా |
| 57 | 10 | పతివ్రత | పవిత్ర |
| 59 | 12 | రాత్రికి | రాత్రికిమధ్య |
| 71 | 2 | యెగిరి | యెరిగి |
| 81 | 6 | పనికెను | పలికెను |
| 81 | 8 | అకృార | అకూార |
| 82 | 6 | గురోరషజ్ఞా | గురోరనుజ్ఞా |
| 83 | 4 | అప్పైన | అప్పైన |
| 85 | 9 | ఽలీపుతుడు | దిలీపుడు |

# కవి మాట

మన పలుకు మాట
కవి పలుకు పాట ॥
అందంగా పలుకగలడు
ఆనందా న్నీయగలడు
అనుభవించగలం మనం
అనుభవింపజేయు నతడు ॥ ॥మన॥

లోలోనికి చూడగలడు
లోతులు తీసియ్యగలడు
రవి కాననిది కూడా
కవి కాంచగలడు ॥మన॥

ఆనందమే పరమావధిగా
అభ్యుదయాన్ని ఆకాంక్షిస్తూ
ఆత్మదర్శన మంతటు చేసి
ధర్మ స్పర్శను అందిస్తాడు ॥మన॥

కాళిదాసు ఒక కవి
భవభూతి ఒక కవి
వారి పలుకులు వెలుగు రేకలు
వారి కృతులు ఆనంద శృతులు ॥మన॥

M. K.

E. K. ⊙ C. V. V.

# కామధేనువు కనికరించిన వేళ

వాగర్థావివ సంపృక్తౌ
వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే
పార్వతీ పరమేశ్వరౌ 1

క్వ సూర్యప్రభవో వంశః
క్వ చాల్పవిషయా మతిః
తి తీర్షుః దుస్తరం మోహా
దుడుపే నాస్మి సాగరం 2

మందః కవియశః ప్రార్థీ
గమిష్యా మ్యుపహాస్యతాం
ప్రాంశులభ్యే ఫలే లోభా
దుద్బాహురివ వామనః 3

అథవా కృత వాగ్ద్వారే
వంశేఽస్మిన్ పూర్వసూరిభిః
మణౌ వజ్రసముత్కీర్ణే
సూత్రస్యే వాస్తి మే గతిః ॥ 4

E. K. ⊙ C. V. V.

# కామధేనువు కనికరించిన వేళ

జగత్తునకు తల్లిదండ్రులైన పార్వతీ పరమేశ్వరులు శబ్దార్థముల వలె విడదీయుటకు శక్యముగాని అన్యోన్యతను అనుభవించుచున్న వారు. అట్టి ఆ ఆది దంపతులను శబ్దార్థముల పొందికను గూర్చిన ఎరుకనిమ్మని ప్రార్థించుచు ఈ రచనను ప్రారంభించుచున్నాను. 1

సూర్యుని నుండి ప్రభవించిన ఆ రఘువంశమెక్కడ? చిన్నదైన ఈ నా మేధ ఎక్కడ ? దాటుటకు అలవిగాని మహాసముద్రమును ఎట్లైన దాటవలెనని చిన్న తెప్పనొకదానిని తీసికొని బయలుదేరు నట్లున్నది. ఇది ఎంతటి అజ్ఞానము! 2

కవియన్న కీర్తిని పొందవలెనన్న వ్యామోహము నన్ను బాగుగా క్రమ్మినట్లున్నది. ఎత్తైనవాడు మాత్రమే అందుకొనగల ఫలమును చూచి పేరాశతో మరిగుజ్జు చేతులు పైకి చాపినట్లున్నది. ఈ నా ప్రయత్నము. అట్టి నేను అపహాస్యము పాలుగాకుండ బయటపడ గలనా? 3

అయినప్పటికిని నా అదృష్టవశమున ఒక మార్గము కనబడుచున్నది. వాల్మీకి మహర్షివంటి మహనీయులు ఇప్పటికే ఈ సూర్యవంశ మును చక్కగా వర్ణించి యున్నారు. వారు వేసిన బాటలో ఇక నేను సాగిపోవచ్చును. వజ్రపు సూదిచే మణులకు బెజ్జములు చేయ బడగా దారమా బెజ్జముల వెంట సాగిపోయినట్లు ఆ మహనీయుల కృపవలన నా పని సుళువగుచున్నది. 4

సోహ మాజన్మ శుద్ధానా
మాఫలోదయ కర్మణాం
ఆ సముద్ర క్షితీశానా
మానాక రథ వర్త్మనాం॥ 5

యథావిధి హుతాగ్నినాం
యథా కామార్చితార్థినాం
యథా పరాధ దండానాం
యథా కాల ప్రబోధినాం॥ 6

త్యాగాయ సంభృతార్థానాం
సత్యాయ మితభాషిణాం
యశసే విజిగీషూణాం
ప్రజాయై గృహమే-ధినాం॥ 7

శైశవేభ్య స్త విద్యానాం
యౌవనే విషయైషిణాం
వార్ధకే ముని వృత్తీనాం
యోగేనాంతే తనుత్యజాం ॥ 8

ఆ సూర్యవంశపు రాజులు జన్మచేతనే పరిశుద్ధులైనవారు. ఫలిత మును సాధించువరకును ప్రయత్నమును ఆపని వారు. సముద్ర పర్యంతముగల భూమికంతటికిని ఏలికలైనవారు. స్వర్గలోకము వరకును తమ రథచక్రముల జాడలుగలిగినవారు. 5

క్రమము తప్పకుండ అగ్నిహోత్రుని అర్చించెడివారు. అర్థిజనుల కోర్కెలను మిగలకుండ తీర్చెడివారు. తప్పు చేసిన వారికి తగిన దండన విధించెడివారు. కాలమునతిక్రమింపకుండ మేల్కాంచి కర్తవ్యమును నిర్వహించెడివారు. 6

దానము చేయుటకొరకే సంపదలార్జించెడి వారు. సత్యవ్రతమును తప్పకుండుటకే తగుమాత్రముగ మాట్లాడెడివారు. కీర్తిప్రతిష్ఠలు వృద్ధి పొందుటకే శత్రురాజ్యములను జయించెడివారు. సత్సంతాన ప్రాప్తికొరకే గృహస్థులయ్యెడి వారు 7

చిన్నతనమున అన్ని విద్యలందను ఆరి తేరెడివారు. యౌవనమున సర్వసుఖములను ధర్మబద్ధముగ అనుభవించెడివారు. పెద్ద వయస్సు మునివృత్తిని అవలంబించి కేవలము అంతర్ముఖులయ్యెడివారు ఆపైన యోగస్థితిలో నిలిచి శరీరములను అవలీలగ విడిచిపెట్టెడివారు.

రఘూణా మన్వయం వక్ష్యే
తను వాగ్విభవోఽపిసన్
తద్గుణైః కర్ణమాగత్య
చాపలాయ ప్రచోదితః ॥ 9

తం సంతః శ్రోతు మర్హంతి
సదస ద్వ్యక్తి హేతవః
హేమ్నః సంలక్ష్యతేఽహ్యగ్నౌ
విశుద్ధిః శ్యామికాపివా ॥ 10

వైవస్వతో మనుర్నామ
మాననీయో మనీషిణాం
ఆసీన్ మహీక్షితా మాద్యః
ప్రణవ శ్ఛందసా మివ ॥ 11

తదన్వయే శుద్ధిమతి
ప్రసూతః శుద్ధిమత్తరః
దిలీప ఇతి రాజేందు
రిందుః క్షీరనిధావివ ॥ 12

ఈ విధముగా రఘువంశపు రాజుల గుణగణములు నా చెవుల బడి నన్ను రచనకు ప్రేరేపించుచున్నవి. నాకుగల భాషా పరిజ్ఞానము పరిమితమే అయినప్పటికిని కలుగుచున్న చాపల్యము నాపుకొనలేక ఇక రచనకు ఉపక్రమించుచున్నాను. 9

ఇది నిజమైన బంగారము. ఇది ఇతర లోహములతో కలసిన బంగారము అని అగ్ని తేల్చి చెప్పినట్లుగా కావ్యమునందు ఇది గుణము ఇది దోషము అని నిరూపింపగలవారు సజ్జనులు. అట్టి సజ్జనులు ఈ రఘు వంశ మహాకావ్యమును వినవలెనని కోరుచున్నాను. సజ్జనులైనవారు మెచ్చి నపుడే గదా! రచయితగా నాకు తృప్తి. 10

వైవస్వతుడు అను మనువున్నాడు. అతడు విద్వాంసులకు సైతము పూజ్యుడు. వేదములకు ఓంకారమువలె సూర్యవంశపు రాజులకు అతడు అది పురుషుడు. అనగా మొదటివాడు. 11

పవిత్రమైన ఆ వంశమున మరింత పవిత్రుడైన దిలీపుడు జన్మిం చెను. ఇది ఎట్లున్నది? క్షీరసాగరమునుండి చంద్రుడు ఉదయించి నట్లున్నది. 12

వ్యూఢోరస్కః వృషస్కంధః
సాలప్రాంశు ర్మహాభుజః
ఆత్మ కర్మ క్షమం దేహం
క్షాత్రో ధర్మ ఇవాశ్రితః ॥ 13

సర్వాతిరిక్త సారేణ
సర్వ తేజోభిభావినా
స్థితః సర్వోన్నతే నోర్వీం
క్రాంత్వా మేరు రివాత్మనా ॥ 14

ఆకార సదృశ ప్రజ్ఞః
ప్రజ్ఞయా సదృశాగమః ।
ఆగమైః సదృశారంభః
ఆరంభ సదృశోదయః ॥ 15

భీమకాంతై ర్నృపగుణైః
సబభూ వోపజీవినాం
అధృష్య శ్చాభిగమ్యశ్చ
యాదో రత్నైరి వార్ణవః ॥ 16

అతనిది విశాలమైన వక్షస్థలము. ఎద్దు మూపువంటి మూపు. చేతులు పొడవైనవి, దృఢమైనవి. మద్ది చెట్టువలె ఎత్తయిన విగ్రహము. తనదైన కర్మమును ఆచరించుటకు క్షాత్ర ధర్మమే ఇట్లు రూపు ధరించినదా! అన్నట్లున్నాడు. 13

భూమిపైన పుట్టుక వచ్చిన జీవరాసులన్నింటికన్న అతని శరీరము బలమైనది, వెలుగైనది, ఉన్నతమైనది. అట్టి దివ్య శరీరముతో ఈ సృష్టి లోన శ్రేష్ఠమైన మేరు పర్వతమువలె ఆ దిలీపుడు ఈ భూమిని ఆక్ర మించినాడు. 14

ఆ ఆకారమునకు తగిన ప్రజ్ఞ, ఆ ప్రజ్ఞకు తగిన శాస్త్ర పరిశ్రమ, శాస్త్ర పరిశ్రమకు తగిన కర్మాచరణము. కర్మాచరణమునకు తగిన ఫలసిద్ధి. దిలీపుడిట్లు పరిపూర్ణుడై వర్థిల్లినాడు. 15

మొసళ్ళవంటి క్రూర జంతువులుండుటచే సముద్రములోనికి పోవలెనన్న భయము. రత్నములవంటి అందమైన వస్తువులుండుటచే ఆ సముద్రములోనికి పోకుండ ఉండలేము. అట్లే ప్రతాపాది సాహస గుణములను చూచి దిలీపుని దరిచేరలేరు. ఔదార్యాది వాత్సల్య గుణము లను చూచి అతని చెంతకు చేరకుండ ఉండలేరు. ఈ విధముగా ఆ ప్రజ లకు దిలీపుడనిన ఒక విధముగా భయము. ఒక విధముగా భక్తి. 16

రేఖామాత్రమపి క్షుణ్ణా
దామనోర్వర్త్మనః పరం
న వ్యతీయుః ప్రజా స్తస్య
నియంతుర్నేమి వృత్తయః॥ 17

ప్రజానామేవ భూత్యర్థం
సతాభ్యో బలి మగ్రహీత్
సహస్రగుణ ముత్స్రష్టు
మాద త్తేహి రసం రవిః ॥ 18

సేనా పరిచ్ఛద స్తస్య
ద్వయమేవార్థ సాధనం
శాస్త్రేష్వకుంఠితా బుద్ధిః
మౌర్వీ ధనుషి చాతతా ॥ 19

తస్య సంవృత మంత్రస్య
గూఢా కారేంగితస్య చ
ఫలానుమేయాః ప్రారంభాః
సంస్కారాః ప్రాక్తనా ఇవ॥ 20

అతడు సారధి. రాజ్యము రథము. ప్రజలు ఆ రథ చక్రముల అంచులు. మనువు నుండి నాటివరకు క్షుణ్ణమైన ధర్మమార్గమున ఆ రథ ప్రయాణము ఎప్పటివలె క్రమము తప్పకుండ సాగుచున్నది. అనగా అతడు, అతడి పరిపాలనము. అతడి ప్రజలు మనువు చూపిన మార్గము వెంట ఏ మాత్రము జవదాటకుండ సాగుచున్నారని అర్థము. 17

తిరిగి వేయింతలుగ వర్షించుటకే కదా! సూర్యుడు భూమినుండి జలములను స్వీకరించుచున్నాడు. అట్లే ప్రజలకు మరింత అభివృద్ధిని కలిగించుటకే దిలీపుడు వారినుండి పన్నులు గ్రహించెను. 18

చతురంగ బలములతో కూడిన సేన అతనికి ఒక లాంఛనము మాత్రమే. నిజమునకు అతని కార్యసాధనములు రెండే. శాస్త్రములయందు కుంటుపడని బుద్ధి కలిగియుండుట మొదటిది. విల్లునకు ఎక్కుపెట్టిన అల్లె త్రాడు రెండవది. 19

ఆ దిలీప మహారాజు తన ఆలోచనలు రహస్యముగ ఉంచుకొనును. తనలో కలిగిన రాగద్వేషాది వికారములను దేహ భాగములలో ఎక్కడను వ్యక్తము కానీయడు. లోనకలిగిన భావములనుబట్టి కను ఎఱ్ఱబడుట, కను బొమలు ముడిపడుట, పెదవులు నవ్వుతో విచ్చుకొనుట మొదలైన చేష్టలు కలుగుట మానవ సహజము. కాని, దిలీపునిలో అట్లు వ్యక్తముకావు. ఇక జరిగిన పనినిబట్టి అతని హృద్గత భావమిది అని ఊహించుకొనవలసినదే. ఈ జన్మలో కలుగుచున్న అనుభవములనుబట్టి పూర్వజన్మమునందలి సంస్కారము లివియని ఊహింతుముకదా! అట్లే దిలీపుని విషయమున గూడ జరుగుచున్న కార్యక్రమములనుబట్టి అతని భావనలివి అయి ఉండ వచ్చునని ఊహింపవలసినదే ! 20

జుగోపాత్మాన మత్రస్తో
భేజే ధర్మ మనాతురః
అగృధ్ను రాదదే సోఽర్థ
మసక్త సుఖమన్వభూత్ ॥ 21

జ్ఞానే మౌనం క్షమాశక్తౌ
త్యాగే శ్లాఘా విపర్యయః
గుణాగుణాను బంధిత్వా
త్తస్య సప్రసవా ఇవ ॥ 22

అనాకృష్టస్య విషయైః
విద్యానాం పారదృశ్వనః ।
తస్య ధర్మరతే రాసీత్
వృద్ధత్వం జరసా వినా ॥ 23

ప్రజానాం వినయాధానాత్
రక్షణా ద్భరణాదపి
సపితా పితర స్తాసాం
కేవలం జన్మ హేతవః ॥ 24

అతనికి భయములేదు కాని శరీరమును శ్రద్ధగా రక్షించుకొనును. అతనికి బాధలులేవు కాని వేద విహిత కర్మలను అనుష్ఠించుట మానడు. అతనికి లోభములేదు కాని ప్రజలనుండి ధనమును పన్నుల రూపమున పద్ధతిగ స్వీకరించును. అతనికి కోరికలేదు కాని సర్వసుఖములను అనుభవించును. 21

అతనికి అన్నియు తెలియును కాని ఎక్కువ మాట్లాడడు అతడు ఏమైన చేయగల శక్తిమంతుడు కాని ఓర్పు వహించుట అతని స్వభావము. అతడు త్యాగి తనది అని అనుకొనకుండ దేనినైన త్యాగము చేయగలవాడు. కాని పొగడు కొనుటకుగాని పొగిడించుకొనుటకు గాని ఇష్టపడడు. జ్ఞానము—మౌనము —శక్తి—క్షమ ఇట్టి సద్గుణ సమన్వయము సామాన్యముగా ఒకచోట కనబడదు. కాని దిలీపునియందు ఇవి జంటలు జంటలుగా పుట్టుకొని వచ్చినవా అన్నట్లున్నవి. 22

అతని మనస్సు అతని వశమున ఉన్నది. విద్యలలో ఆవతలి ఒడ్డును చేరిన స్థితి అతడిది. నిరంతరము ధర్మాచరణమునందే అతడికి ఆసక్తి. ఒక్క ముసలి తనము రాలేదుగాని మిగిలిన అన్ని అంశముల యందును అతడు పెద్దయే. 23

శిక్షకుడై ప్రజలను సన్మార్గమున నిలిపెను. రక్షకుడై వారికి భయములేని బ్రతుకునిచ్చెను. పోషకుడై వారికేలోటు లేకుండ చూచెను. ఒక్క మాటలో చెప్పవలెనన్నచో అతడు వారికి అన్ని విధముల తండ్రియై నిలిచెను. మరి వారి తల్లిదండ్రులో? వారు కేవలము జన్మనిచ్చిన కారణము చేత తల్లిదండ్రులనబడుచున్నారు. 24

స్థిత్యై దండయతో దండ్యాన్
పరిణేతుః ప్రసూతయే
అప్యర్థకామౌ తస్యా స్తాం
ధర్మమైవ మనీషిణః ॥ 25

దుదోహ గాం స యజ్ఞాయ
సస్యాయ మఘవాదివం
సంపద్వినిమయే నోభౌ
దధతు ర్భువన ద్వయం ॥ 26

నకిలాను యయు స్తస్య
రాజానో రక్షితుర్యశః
వ్యావృత్తా యత్పరస్వేభ్యః
శ్రుతౌ తస్కరతా స్థితా ॥ 27

ద్వేష్యోఽపి సమ్మతః శిష్టః
తస్యా ర్తస్య యథౌషధం ।
త్యాజ్యోదుష్టః ప్రియోఽప్యాసీ
దంగుళీ వోరగక్షతా ॥ 28

రాజ్యమున ధర్మమును ప్రతిష్ఠించుటకై అతడు దండింపవలసిన వారికి దండన విధించెను. వంశాంకురములను పొందుట కొరకే వివాహ మాడి గృహస్థాశ్రమమును స్వీకరించెను. ఈ విధముగ అర్థకామములను ధర్మబద్ధముగ ధర్మము కొరకే నిర్వహించుటలో అతడి జీవితమే ధర్మ మయ మయ్యెను. 25

ఆ దిలీపుడు భూమిని పిండగా వచ్చిన సస్యములనుండి హవిస్సు లను రూపొందించి యజ్ఞయాగాది క్రతువులందు ఇంద్రునకు సమర్పించు చుండెను. ఆ ఇంద్రుడు స్వర్గమును పిండగా వ్యక్తమయిన వర్షములతో భూమిపైన పంటలను వృద్ధిచేయుచుండెను. ఈ విధముగా సంపదలను పర స్పరము ఇచ్చి పుచ్చుకొనుచు వారిరువురు స్వర్గ భూలోకముల రెండింటిని తృప్తిగ పోషించిరి. 26

రక్షకుడైన ఆ దిలీపుని కీర్తి ప్రతిష్ఠలను ఇతర రాజులెవ్వరును అనుకరింపలేక పోయిరి. అనగా అపహరింపలేక పోయిరి. ఇట్లు జరుగుటకు ఒక కారణమున్నది. ఆ దిలీపుని రాజ్యమున దొంగతనము అనునది ఇత రుల సిరిసంపదలను స్పృశింపలేక కేవలము ఒక శబ్దముగా మాత్రము మిగిలిపోయినది. 27

నోటికి రుచింపకపోయినను రోగి ఔషధమును శ్రద్ధతో స్వీకరించు నట్లు, ఎదుటివాడు శత్రువైనను అతడు సజ్జనుడైనపుడు దిలీపుడు వానిని అభిమానించెను. ఎదుటివాడు మిత్రుడైనను అతడు దుష్టుడైనపుడు పాము చేత కాటువేయబడిన వ్రేలినివలె వానిని దూరముగనె ఉంచెను. 28

తం వేధాః విదధే నూనం
మహా భూత సమాధినా
తథా హి సర్వే తస్యాసన్
పరార్థైక ఫలాః గుణాః ॥ 29

స వేలా వప్రవలయాం
పరిఖీకృత సాగరాం
అనన్యశాసనా ముర్వీం
శశాసైకపురీ మివ ॥ 30

తస్య దాక్షిణ్య రూఢేన
నామ్నా మగధ వంశజా
పత్నీ సుదక్షిణే త్యాసీ
దధ్వర స్యేవ దక్షిణా ॥ 31

కళత్రవంత మాత్మాన
మవరోధే మహత్యపి
తయా మేనే మనస్విన్యా
లక్ష్మ్యా చ వసుధాధిపః ॥ 32

పంచభూతములను సరియగు పాళ్ళలో సమ్మేళనముచేసి సృష్టి కర్త ఆ దిలీపుని రూపొందించెను. ఇది నిజము. కనుకనే అతని నుండి వ్యక్తమగుచున్న గుణగణము లన్నియు పంచభూతములవలె లోక హితమునే పరమ ప్రయోజనముగా అభిలషించుచున్నది. 29

చెలియలి కట్ట అనగా సముద్రము యొక్క ఒడ్డు. ఆ చెలియలి కట్టయే అతనిరాజ్యమునకుప్రాకారమయినది. సముద్రములేఅగడ్తఅయినవి. అనగా కందకముగా రూపొందినవి. ఇంకెవరి శాసనమునకు మచోటులేని ఆ భూమినంతటిని అతడు ఒకే పట్టణమువలె అనాయాసముగ పాలించెను. 30

మగధ వంశమున ఉద్భవించిన సుదక్షిణాదేవి పేరుకు తగినట్లుగ దాక్షిణ్యముతో నిండిన వ్యక్తిత్వము గలది. యజ్ఞపురుషుని దక్షిణాదేవి చేరినట్లు ఈ సుదక్షిణాదేవి దిలీపుని చేరినది అనగా అతనికి సహధర్మ చారిణి అయినది. 31

ఆ దిలీప మహారాజునకు అంతఃపుర స్త్రీలు ఎందరో ఉన్నారు. కాని అతడు బుద్ధిమంతురాలు, దృఢచిత్త అయిన సుదక్షిణా దేవినీ, తన రాజ్య లక్ష్మిని ఈ ఇరువురినే తన భార్యలుగా భావించెను. 32

తస్యా మాత్మానురూపాయాం
ఆత్మ జన్మ సముత్సుక ః
విలంబిత ఫలైః కాలం
స నినాయ మనోరథైః॥ 33

సంతానార్థాయ విధయే
స్వభుజా దవతారితా ।
తేన ధూర్జగతో గుర్వీ
సచివేషు నిచిక్షిపే ॥ 34

అథాభ్యర్చ్య విధాతారాం
ప్రయతౌ పుత్రకామ్యయా ।
తౌ దంపతీ వసిష్ఠస్య
గురో ర్జగ్మతు రాశ్రమం ॥ 35

స్నిగ్ధ గంభీర నిర్ఘోష
మేకస్యందన మాస్థితౌ ।
ప్రావృషేణ్యం పయోవాహం
విద్యు దైరావతా వివ ॥ 36

అతడు తనకు అన్నివిధముల అనుకూలవతియైన ఆ సుదక్షిణాదేవి యందు తనకు ప్రతిరూపమైన పుత్రుని పొందవలెనన్న ఉత్సాహముతో నున్నాడు. కాని అందుకు ఆలస్యము జరుగుచున్నది. అతడు అట్లే ఆ కోరిక తప్పక తీరునన్న ప్రగాఢ విశ్వాసముతో కాలము గడుపుచున్నాడు. 33

సంతానార్థమై తగిన విధి విధానమును ఆచరింపగోరిన ఆ దిలీపుడు గొప్పదైన రాజ్యభారమును తన భుజములపై నుండి దింపితన మంత్రులపై నిలిపెను— 34

అటుపైన ఆ దంపతులు పుత్రునికోరి నియమవ్రతులై బ్రహ్మదేవుని అర్చించి తమ కుల గురువైన వసిష్ఠ మహర్షి ఆశ్రమమునకు బయలు దేరిరి. 35

వర్షాకాలపు మేఘము నధిష్ఠించిన విద్యుదైరావతములవలె ఆ దంప తులు ఒకే రథముపై ఆసీనులై ముందుకు సాగిరి. ఆ రథ ఘోష మధురము గను, గంభీరముగను వినబడుచు శుభమును సూచించుచున్నది. 36

మాభూ దాశ్రమ పీడేతి
పరిమే య పునస్సరౌ
అనుభావ విశేషాత్తు
సేనా పరివృతావివ ॥ 37

సేవ్యమానౌ సుఖస్పర్శైః
సాల నిర్యాస గంధిభిః
పుష్పరేణూ త్కిరై ర్వాతై
రాధూత వనరాజిభిః ॥ 38

మనోభిరామాః శృణ్వంతౌ
రథనేమి స్వనోన్ముఖైః
షడ్జ సంవాదినీః కేకాః
ద్విధాభిన్నాః శిఖండిభిః ॥ 39

పరస్పరాక్షి సాదృశ్య
మదూరోజ్ఝిత వర్త్మసు
మృగ ద్వంద్వేషు పశ్యంతౌ
స్యందనాబద్ధ దృష్టిషు ॥ 40

ఆశ్రమ వాతావరణమునకు ఇబ్బంది కలుగకూడదను ఉద్దేశముతో ఆ దంపతులు వెంట వచ్చునట్టి పరివారమును పరిమితము చేసిరి. అయినప్పటికిని సహజమైన తమ తేజో విశేషముచేత వారు మహాసేనా సమన్వితులా అన్నట్లు వెలుగొందుచున్నారు. 37

చల్లని పిల్లగాలులు సాలవృక్షముల జిగురులనుండి వ్యక్తమగుచున్న సువాసనలతో, విరజిమ్మబడుతున్న పుప్పొడులతో, వనమునందలి చెట్లను మెల్లగా ఊపుచు ఆ దంపతులను స్పృశించి సేవించుటలో శుభమును పల్కుచుండగా వారి రథము ముందుకు సాగుచుండెను. 38

ఆ రథ చక్రఘోషను మేఘగర్జనగా అనుకొని నెమళ్ళు తలలు పైకెత్తి క్రేంకారములు చేయుచుండెను. ఆ క్రేంకారములు రెండుగా చీలి పలుకబడుచున్న షడ్జస్వరమువలె మనోహరముగా నున్నది. ఆ అనుభూతిలో తేలియాడుచు దంపతులు ముందుకు సాగిరి. 39

ఆ అరణ్యమునందలి లేళ్ళ జంటలు పారిపోక మార్గమునకు దగ్గరలో నిలబడి ఆ రథముపై పే చూచుచున్నవి. అనగా ఆ రథమునందలి దంపతులపై పే చూచుచున్నవి. ఆ దంపతులుకూడ ఆ లేళ్ళ జంటల కన్నులలో తమ కన్నులకుగల పోలికలను చూచుకొనుచుండగా రథము సాగిపోవుచుండెను. 40

శ్రేణీబంధా ద్వితన్వద్భిః
ర స్తంభాం తోరణ స్రజమ్
సారసైః కల నిర్హ్రాదైః
క్వచి దున్నమితాననౌ ॥ 41

పవన స్యానుకూలత్వాత్
ప్రార్థనాసిద్ధి శంసినః
రజోభి స్తురగోత్కీర్ణై
రస్పృష్టాలక వేష్టనౌ ॥ 42

సరసీ ష్వర విందానాం
వీచి విక్షోభశీతలాం
ఆమోద ముపజిఘ్రంతౌ
స్వనిశ్వాసానుకారిణం॥ 43

గ్రామే ష్వాత్మవిసృష్టేషు
యూపచిహ్నేషు యజ్వనాం
అమోఘాః ప్రతిగృహ్ణంతౌ
వర్ఘ్యానుపద మాశిషః ॥ 44

సాయం సమయము అగుచున్నది. ప్రయాణము సాగుచునే ఉన్నది. ఆకసమున బారులుతీర్చి నివాసముల కేగుచున్న బెగ్గురు పక్షులు స్తంభములు లేకుండగనే తోరణములు వ్రేలాడుచున్నవా! అన్నట్లున్నవి. మధురముగా కూయుచున్న ఆ పక్షులను అప్పుడప్పుడు తగుమాత్రముగ తలలు పైకెత్తి చూచుచు ఆ దంపతులు ముందుకుసాగిరి. 41

పవనుడు అనుకూలుడై కోరిక తప్పక సిద్ధించునని తెలియజేయుచు ఆ దంపతులవెంట అదే వైపునకు సాగుచున్నాడు. దానితో గుర్రముల గిట్టలచే రేగగొట్టబడిన దుమ్ము వెనుకకురాక ముందునకే పోవుచు సుదక్షిణాదేవి ముంగురులనుగాని దిలీప చక్రవర్తియొక్క తలపాగానుగాని స్పృశింపలేక పోవుచున్నది. 42

ప్రయాణము సాగుచున్న మార్గమునకు చేరువలో సరస్సులున్నవి. ఆ సరస్సులలో పద్మములున్నవి. అలల తాకిడికి ఆ పద్మములు చల్లని సుగంధ వాయువులను ప్రసరింపజేయుచున్నవి. ఆ ప్రసరించుచున్న సుగంధ వాయువులు సరిగా ఆ దంపతుల నిశ్వాస వాయువులను పోలి యున్నవి. అట్టి ఆ సుగంధ వాయువులను పీల్చుటలో సేద తీరుచు వారు ముందుకుసాగిరి. 43

సాగుచున్న ప్రయాణమున తాము ఋషులకు సమర్పించిన గ్రామము లకు ఆ రాజదంపతులు చేరువైరి. నిరాఘాటముగా సాగుచున్న యజ్ఞ యాగములకు చిహ్నములుగా యూపస్తంభములు ఆ గ్రామములలో ఎల్లెడల కనిపించుచున్నవి. ఆ గ్రామములందలి ఋషులు ఆ రాజదంపతులకు అర్ఘ్యముతోపాటు అమోఘములైన ఆశీస్సులను అందించిరి. 44

హైయంగవీన మాదాయ
ఘోష వృద్ధానుపస్థితాన్
నామధేయాని పృచ్ఛంతౌ
వన్యానాం మార్గశాఖినాం ॥

కాప్యభిఖ్యా తయోరాసీత్
వ్రజతోః శుద్ధవేషయోః
హిమ నిర్ముక్త యోర్యోగే
చిత్రా చంద్రమ సోరివ ॥

తత్తద్భూమిపతిః పత్న్యై
దర్శయన్ ప్రియదర్శనః
అపిలంఘిత మధ్వానం
బుబుధేన బుధోపమః॥

స దుష్ప్రాప యశాః ప్రాప
దాశ్రమం శ్రాంత వాహనః
సాయం సంయమిన స్తస్య
మహర్షే ర్మహిషీ సఖః ॥

అపుడే సిద్ధము చేయబడిన అవునేతితో చేరవచ్చిన గొల్ల పెద్దలను మార్గమునందలి వివిధ వృక్షముల పేర్లడిగి తెలిసికొనుచు, తమ పలికరింపులకు ఆ పెద్దలు ముచ్చట పడుచుండగా దంపతులు ముందుకు సాగిరి. 45

ఇంతగా ప్రయాణము సాగుచున్నను పవనుని అనుకూలతవలన వారి వస్త్రములు ఏ మాత్రము మాపునకు లోనుకాలేదు. కాకపోగా వారా వస్త్రధారణలో మరింత ఉజ్జ్వలముగ కనిపించుచున్నారు. ఒకానొక అనిర్వచనీయమైన శోభయేదో వారిలో కొట్టవచ్చినట్లు కనిపించుచున్నది. మంచుతెరలనుండి బయటపడిన చైత్రమాస పూర్ణిమనాటి చిత్రాచంద్రుల వలె ఒక్కటిగ నిలిచిన ఆ సుదక్షిణా దిలీపులు వెలిగిపోవుచున్నారు. 46

మార్గమునందలి వింతలను భార్యకు చూపుచు చూడముచ్చటగనుండి తెలివి తేటలలో బుధుని తలపించుచున్న దిలీపునకు గడచిన దూరము గమనికలో లేదు. అనగా పత్నితో ముచ్చటలాడుచు సాగుచున్న అతనికి ప్రయాణము చేయుచున్నట్లే అనిపించుటలేదని అర్థము. 47

అనితరసాధ్యమైన యశస్సును ఆర్జించిన ఆ దిలీపుడు, అశ్వములు అలసట చెందినను తాను అలసట చెందక, సుదక్షిణాసఖుడై సంయమియైన వసిష్ఠమహర్షి ఆశ్రమ వాతావరణమున ప్రవేశించెను. 48

వనాంతరా దుపావృత్తైః
సమి త్కుశ ఫలాహరైః
పూర్యమాణ మదృశ్యాగ్ని
పత్యుద్యాతై స్తపస్విభిః ॥ 49

ఆకీర్ణ మృషిపత్నీనాం
ముటజ ద్వార రోధిభిః
అపత్యైరివ నీవార
భాగధేయోచతై ర్మృగైః ॥ 50

సేకాంతే మునికన్యాభిః
తత్క్షణోజ్ఝిత వృక్షకం
విస్రంభాయ విహంగానా
మాలవాలాంబు పాయినాం ॥ 51

ఆతపాత్యయ సంక్షిప్త
నీవారాసు నిషాదిభిః
మృగై ర్వర్తిత రోమంథ
ముటజాంగణ భూమిషు ॥ 52

సమిధలు, దర్భలు, ఫలములు మొదలైనవి ఇతర వనములనుండి సేకరించుకొని ఆశ్రమ ప్రాంతమున ప్రవేశించుచున్న ముని బృందములకు వారి వారి అగ్నిహోత్రములు అదృశ్య రూపమున స్వాగతము పలుకుచున్నవి. నిండైన ఆ దృశ్యమను చూచుచు సాగుచున్న దిలీప దంపతులకు కన్నుల పండుగైనది. 49

లేడిపిల్లలు కుటీర ద్వారములచెంత మునిపత్నులను అటునిటు పోనీయక నిలబెట్టి బిడ్డలవలె గారాము పోవుచున్నవి. తమ వంతు నివ్వరి ధాన్యమును తమకు పెట్టమని తమకుగల అర్హతతో మారాము చేయుచున్నవి. మనస్సులను మురిపించు ఆ దృశ్యమను చూచి పులకించుచు దంపతులు ముందుకు సాగుచున్నారు. 50

నీరుపోయు సమయమును కనిపెట్టి దాహము తీర్చుకొనుటకు అలవాటుపడిన పక్షులకు ఏ మాత్రము ఇబ్బంది కలుగకూడదని మునికన్యలు పాదులలో నీరుపోసి వెంటనే ఇవతలకు వచ్చుచున్నారు. వాత్సల్యముతో నిండిన ఆ దృశ్యమునకు ముచ్చటపడుచు ఆ దంపతులు ముందుకు సాగుచున్నారు. 51

ఎండ తగ్గిపోయి చల్లబడినదని పర్ణశాలల ముందున్న నివ్వరి ధాన్యము ప్రోగులుగ చేయబడినది. లేళ్ళు ఆ ధాన్యపుప్రోవుల ప్రక్కనే పండుకొని వనమున తినివచ్చిన ఆహారమును నెమరువేసుకొనుచున్నవి. ప్రక్కనే ఉన్నను ధాన్యమును ముట్టని ఆ లేళ్ళ క్రమశిక్షణకు అబ్బురపడుచు ఆ దంపతులు ముందుకుసాగిరి. 52

అభ్యుత్థితాగ్ని పిశునై
రతిథీ నాశ్రమోన్ముఖాన్
పునానం పవనోద్ధూతై
ర్ధూమై రాహుతి గంధిభిః ॥

అథయంతార మాదిశ్య
ధుర్యాన్ విశ్రామయేతి నః
తామవారోపయత్పత్నీం
రథా దవతతార చ ॥

తస్మై సభ్యా స్సభార్యాయ
గోప్త్రే గుప్తతమేంద్రియాః
అర్హణాం అర్హతే చక్రుః
మునయో నయచక్షుషే ॥

విధే స్సాయంతన స్యాంతే
స దదర్శ తపోనిధిం
అన్వాసిత మరుంధత్యా
స్వాహయేవ హవిర్భుజం ॥

ఆ ఆశ్రమ ప్రాంతమంతయు వ్యాపించుచున్న పొగలు మునులచే ప్రజ్వలింప జేయబడుచున్న సాయంకాలమందలి హోమాగ్నులను సూచించు చున్నవి. ప్రేల్చబడుచున్న ఆహుతులయొక్క సుగంధములను ప్రసరింప జేయుచు ఆ పొగలు ఆశ్రమమును చేరవచ్చుచున్న అతిథులను పవిత్రము చేయుచున్నవి. 53

ఆ పైన రథమును ఆపి అలసిపోయిన అశ్వములను సేదదీర్చు మని సారథిని ఆజ్ఞాపించి దిలీపుడు భద్రముగా భార్యను క్రిందికిదింపి తాను కూడ రథమును దిగెను. 54

సంప్రదాయనిష్ఠులు నియతేంద్రియులు, అయిన మునిపుంగవులు రక్షకుడు, పూజ్యుడు, నీతికోవిదుడు అయిన దిలీపచక్రవర్తి భార్యతోకూడి వచ్చిన శుభవేళ అతిథిపూజ చేసిరి. 55

సాయంకాల విధులను పూర్తిచేసి అరుంధతీదేవితో కూడియున్న వసిష్ఠుడు స్వాహాదేవితో కూడియున్న అగ్నిహోత్రునివలె వెలుగొందు చుండగా సుదక్షిణా సమేతుడై దిలీపుడు వారిని దర్శించెను. 56

తయో ర్జగృహతుః పాదౌ
రాజా రాజ్ఞీ చ మాగధీ
తౌ గురు ర్గురుపత్నీ చ
ప్రీత్యా ప్రతి ననందతుః ॥ 57

త మాతిథ్య క్రియాశాంత
రథ క్షోభ పరిశ్రమం
ప్రపప్రచ్ఛ కుశలం రాజ్యే
రాజ్యాశ్రమ మునిం మునిః ॥ 58

అథాథర్వ నిధే స్తస్య
విజితారి పురఃపురంః
అర్థ్యా మర్థ పతిర్వాచ
మాదదే వదతాం వరః ॥ 59

ఉపపన్నం నను శివం
సప్త స్వంగేషు యస్య మే
దైవీనాం మానుషీణాం చ
ప్రతి కర్తా త్వ మాపదాం ॥ 60

సుదక్షిణా దిలీపులు భక్తితో అరుంధతీ వసిష్ఠుల పాదములకు నమస్కరించిరి. అరుంధతీ వసిష్ఠులు ప్రేమతో ఆ రాజదంపతులకు ఆశీస్సు లందించిరి. 57

రాజ్యమనెడి ఆశ్రమమున మునివలె సంచరించుచున్న ఆ దిలీపుని మునివరుల అతిథి సత్కారములవలన ప్రయాణమందలి బడలికనుండి తేరుకొనిన వానినిగ గమనించి వసిష్ఠ మహాముని రాజ్యమును గూర్చిన కుశల ప్రశ్నలు వేసెను. 58

శత్రుపురములను అవలీలగ జయించినవాడు సంపదలలో కుబేర సమానుడు అయిన దిలీపుడు అర్థవంతముగ మాటలాడగల నేర్పరి. మానవుల మంచి చెడులను సరిచూడగల అథర్వ వేదనిధియగు వసిష్ఠునితో అత డిట్లనెను. 59

ఎవని రాజ్యమున దైవపరము, మానుషపరమైన ఆపదలకు ప్రతిక్రియ చేయుటకు నిత్యసంసిద్ధుడవై నీవున్నావో అట్టి నా రాజ్యమున రాజ్యాంగములు ఏడును క్షేమముగ నుండుట సహజమేకదా! 60

తవ మంత్రకృతో మంత్రైః
ర్దూరాత్ప్రశమితాంభిః
ప్రత్యాదిశ్యంత ఇవ మే
దృష్ట లక్ష్యభిదః శరః ॥ 61

హవిరావర్జితం హోతః
త్వయా విధివ దగ్నిషు
వృష్టిర్భవతి సస్యానా
మవగ్రహ విశోషిణాం ॥ 6[illegible]

పురుషాయుష జీవినో్య
నిరాతంకాః నిరీతయః
యన్మదీయాః ప్రజా స్తస్య
హేతు స్త్వ ద్బ్రహ్మవర్చసం ॥ 6

త్వయైవం చింత్యమానస్య
గురుణా బ్రహ్మయోనినా
సానుబంధాః కథం న స్యుః
సంపదో మే నిరాపదః ॥ 6

గురువర్యా ! అమోఘమగు నీ మంత్రశక్తితో ఇచ్చట నుండియే ువు శత్రువులను వారించుచున్నావు. ఇక అచ్చటనున్న నా బాణములకు పనియేది ? కనబడకుండగనే శత్రువులను నివారించు నీ మంత్రముల ముందు కనబడునట్టి లక్ష్యములను మాత్రమే ఛేదించగల నా బాణములు ురాకరింపబడుచున్నవా ! అన్నట్లున్నది. నీ మంత్రశక్తి ముందుగనే శత్రువులను నిర్వీర్యులను చేయుచుండగా నా శస్త్రశక్తి ఆ పైన నిమిత్త ముగా నిలిచి వారిని సంహరించుచున్నదని నిరంతరము గమనికకు వచ్చు చునే యున్నది. 61

ఓ మహాకర్తా ! మహర్షీ ! యథావిధిగా నీచే హోమములందు వేల్చబడుచున్న హవిస్సులకు సకల దేవతలు తృప్తినందుచుండగా ఇక నా రాజ్యమునవర్షములకేమి లోటుండును? ఒక్కమాటలో చెప్పవలెనన్నచో హోమమునందు నీచే విడువబడుచున్న హవిస్సే వర్షమై నా రాజ్యమందలి పైరులకు ప్రాణము పోయుచున్నది. 62

నా రాజ్యమున అకాల మృత్యువులేదు. ప్రజలందరు పూర్ణాయు వులై ఏ ఈతి బాధలు లేకుండ నిర్భయులై బ్రతుకుచున్నారు. మునీంద్రా ! నీవు నిత్యము అనుష్ఠించుచున్న వ్రతాధ్యయనాది రూపమైన తపస్సే దీనికి కారణము. 63

మహర్షీ ! నీవు బ్రహ్మదేవుని పుత్రుడవు. విశేషించి మాకు గురు మూర్తివి. అట్టి నీచే నిరంతరము తలంపబడుచున్న నాకు ఆపదలు ఎట్లు కలుగును ? ఎడతెగని సంపదలు ఎట్లు కలుగకుండును ? 64

కింతు వధ్వాం తవై తస్యా
మదృష్ట సదృశ ప్రజం
నమా మవతి స ద్వీపా
రత్న సూరపి మేదినీ ॥

నూనం మత్తః పరం వంశ్యాః
పిండ విచ్ఛేద దర్శినః
న ప్రకామ భుజ శ్శ్రాద్ధే
స్వధా సంగ్రహ తత్పరాః ॥

మత్పరం దుర్లభం మత్వా
నూన మావర్జితం మయా
పయః పూర్వైః స్వ నిశ్వాసైః
కవోష్ణ ముపభుజ్యతే॥

సోఽహ మిజ్యా విశుద్ధాత్మా
ప్రజాలోప నిమీలితః
ప్రకాశశ్చాప్రకాశశ్చ
లోకాలోక ఇవాచలః ॥

కాని తండ్రీ ! ఈ మీ కోడలియందు నాకు ప్రతిరూపమైన పుత్రుని ఇంతవరకు పొందలేక పోయితినన్న బాధలో నున్న నన్ను ద్వీపములతో కూడుకొనుట వల్ల గాని, రత్నములు ప్రసవించి సమర్పించుట వల్ల గాని ఈ భూదేవి సంతోషపెట్టలేక పోవుచున్నది. 65

నా తరువాత తమకు పిండ ప్రదానము చేయువారు లేరన్న నిశ్చయమునకు వచ్చిన పితరులు నాచే సమర్పింపబడిన భోజన పదార్థములను తృప్తిగ స్వీకరించుటలేదు. వారా భోజన ద్రవ్యములను దాచుకొనుటలో నిమగ్నమగుచున్నారు. 66

నా తరువాత తమకు తర్పణములు వదలువారు లేరన్న నిశ్చయమునకు వచ్చిన పితరులు నేను వారికి అలలతో కూడిన జలములను సమర్పించునపుడు నిట్టూర్పులు విడుచుచు స్వీకరించుచున్నారు. ఆ నిట్టూర్పులకు ఆ జలములు వేడెక్కుట నా కనుభవమగు చున్నది. 67

యజ్ఞయాగాదులతో దేవతలను తృప్తిపరచి దేవ ఋణము తీర్చుకొంటిని. సంతతి లేమిచే పితరులను తృప్తిపరచలేక పోవుటతో పితృ ఋణమును తీర్చుకొనలేక పోతిని. దేవతలను తృప్తిపరచితిని గదాయని ఒకవైపు తృప్తి, పితరులను తృప్తిపరచలేక పోతినే అని మరొకవైపు అసంతృప్తి. ఒకవైపు చక్కగా ప్రకాశించుచు మరొకవైపు చీకటితో నిండియున్న లోకాలోక పర్వతమువలె నిలబడియున్నాను. 68

లోకాంతర సుఖం పుణ్యం
తపో దాన సముద్భవం
సంతతిః శుద్ధవంశ్యాతు
పరత్రేహచ శర్మణే ॥

తయాహీనం విధాంత ర్మాం
కథం పశ్య న్నదూయసే
సిక్తం స్వయ మివ స్నేహా
ద్వంద్య మాశ్రమ వృక్షకం ॥

అసహ్యాపీడం భగవన్
ఋణ మంత్యమవేహిమే
అరుంతుద మివాలాన
మని ర్వాణస్య దంతినః ॥

తస్మాన్ముచ్యే యధా తాత
సంవిధాతుం త్వ మర్హసి
ఇక్ష్వాకూణాం దురాపేఽర్థే
త్వ దధీనా హి సిద్ధయః ॥

తపస్సు, దానముల వల్ల పరలోక సుఖము మాత్రమే లభించగా పవిత్రమైన వంశమున ఉద్భవించిన సంతతివల్ల పరలోకముననేగాక ఇహ లోకమున గూఢ సుఖము సిద్ధించును కదా ! 69

నీవు బ్రహ్మదేవుని పుత్రుడవు. మాపాలిటి సృష్టికర్తవు నీవు. ఈ విధముగా సంతతిలేక ఆశ్రమమునందు నీచే నిరంతరము ప్రేమయే జలము లుగా పోయబడుచున్నను ఫలించని వృక్షమువలె నిలబడి యున్నాను కదా! తండ్రీ నీ వెట్లు చూచుచు ఊరకుండగలుగుచున్నావు ? 70

శరీరము మలినమై స్నానము కొరకు వెంపరలాడి పోవుచున్న ఏనుగునకు కట్టు కొయ్య అడ్డుపడి మర్మ భేదకమైన బాధను కలిగించినట్లు ఓ భగవాన్ ! తీరని ఈ పితృ ఋణము నన్ను భరించలేని వేదనకు గురి చేయుచున్నది. 71

తండ్రీ ! పితృ సంబంధమైన ఈ ఋణము నుండి నేనెట్లు బయట పడుదునో అట్లు నడిపించవలసినది నీవే ! ఇటువంటి దుర్లభములైన అంశములయందు ఇక్ష్వాకు వంశీయుల ఫలసిద్ధులు నీ యధీనముననే యున్నవి కదా ! 72

ఇతి విజ్ఞాపితో రాజ్ఞా
ధ్యాన స్థిమిత లోచనః ।
క్షణమాత్ర మృషి స్తస్థౌ
సుప్త మీన ఇవ హ్రదః ॥ 73

సోఽపశ్యత్ ప్రణిధానేన
సంతతి స్తంభకారణం
భావితాత్మా భువో భర్తు
రథైనం ప్రత్యబోధయత్॥ 74

పురా శక్రముపస్థాయ
తవోర్వీం ప్రతి యాస్యతః
ఆసీ త్కల్పతరుచ్ఛాయా
మాశ్రితా సురభిః పథి । 75

ధర్మలోప భయా ద్రాజ్ఞీ
మృతుస్నాతా మనుస్మరన్
ప్రదక్షిణ క్రియార్హాయాం
తస్యాం త్వం సాధునా చరః ॥ 76

ఈ విధముగా దిలీపుడు దీనవదనుడై విన్నవింపగా వసిష్ఠుడు కొద్ది సేపు ధ్యాన స్థితిని పొందెను. కన్నులు నిశ్చలములై ధ్యానమున నిలచిన ఆ మహర్షి చేపలు నిద్రించిన సరస్సువలె విప్పారెను. 73

ధ్యానమున, శరణాగతి మార్గమున మనస్సు కరుగగా ఆత్మ స్వరూపమై నిలిచి దిలీపుని విషయమున సంతతి కలుగక పోవుటకు కారణమును దర్శించి దానిని అతనికి ఇట్లు తెలియజెప్పెను. 74

పూర్వమొకప్పుడు నీవు దేవేంద్రుని సేవించి భూమికి తిరిగి వచ్చునపుడు, ఆ దారిలో కల్పవృక్షము క్రింద, ఆ నీడలో కామధేనువు నిలచి యుండెను. 75

సుదక్షిణా దేవి ఋతుస్నాతయై గర్భధారణకు అనుకూలమగు సమయమున ఉన్నది. ఆమెను చేరుట ధర్మము. లేనిచో ధర్మమునకు లోపమగు నన్న భయముతో తిరుగు ప్రయాణమున తొందరపడుచున్న నీవు ప్రదక్షిణము చేసి, నమస్కరింపవలసిన కామధేనువును గమనింపకనే సాగిపోయితివి, 76

అవజానాసి మాం యస్మాత్
తత స్తేన భవిష్యతి
మత్ప్రసూతి మనారాధ్య
ప్రజేతి త్వాం శశాప సా॥ 77

సశాపో న త్వయా రాజన్
న చ సారథినా శ్రుతః
న దత్యాకాశ గంగాయాః
స్రోత స్యుద్దామ దిగ్గజే॥ 78

ఈప్సితం తదవజ్ఞానాత్
విద్ధి సార్గళమాత్మనః
ప్రతిబధ్నాతి హి శ్రేయః
పూజ్యపూజా వ్యతిక్రమః ॥ 79

హవిషే దీర్ఘ సత్రస్య
సాచేదానీం ప్రచేతసః
భుజంగ పిహిత ద్వారం
పాతాళ మధితిష్ఠతి. ॥ 80

ఆ కామధేనువునకు కోపము వచ్చినది. ఏ సంతతి కొరకు నన్ను పట్టించుకొనకుండ నీవు సాగిపోవుచున్నావో ఆ సంతతి నా సంతతిని ఆరాధింపనిదే నీకు కలుగదు అని నిన్ను శపించినది 77

మదించిన దిగ్గజము యొక్క ఘీంకారములతో నిండిన ఆకాశగంగా ప్రవాహపు రొదలో ఆ శాపము నీకుగాని కనీసము నీ సారధికి గాని వినబడలేదు. 78

ఆ కామధేనువునకు అట్లు అవమానము జరుగుట వలన నీ కోరిక తీరుటకు ప్రతిబంధక మేర్పడినది. పూజ్యులైన వారిని పూజింపకుండుట శ్రేయస్సును ఆటంకపరచును కదా ! 79

ఆ కామధేనువు ప్రస్తుతము స్వర్గమున లేదు. పాములచే కప్పబడిన ద్వారము గల పాతాళలోకమున ప్రచేతసుడు తలపెట్టిన దీర్ఘమైన సత్రయాగమునకు హవిస్సులందించు దీక్షలో నున్నది. 80

సుతాం తదీమాం సురభేః
కృత్వా ప్రతినిధిం శుచిః
ఆరాధయ సపత్నికః
ప్రీతా కామదుఘాహి సా ॥ 81

ఇతి వాదిన ఏవాస్య
హోతు రాహుతి సాధనం
అనింద్యా నందినీ నామ
ధేను రావవృతే వనాత్ ॥ 82

లలాటోదయ మాభుగ్నం
పల్లవ స్నిగ్ధపాటలా
బిభ్రతీ శ్వేత రోమాంకం
సంధ్యేవ శశినం నవం ॥ 83

భువం కోష్ణేన కుండోధ్ని
మేధ్యే నావభృథా దపి
ప్రస్రవే ణాభివర్షంతి
వత్సాలోక ప్రవర్తినా ॥ 84

ఆ కామధేనువునకు పుత్రికయైన నందిని యున్నది. ఆమెను కామధేనువునకు ప్రతినిధిగ స్వీకరించి శుచివై సుదక్షిణతో కూడి సేవింపుము. ఆ నందని ప్రీతి చెందినచో కామితార్థములను అనుగ్రహించగలదు. 81

వసిష్ఠుడట్లు పలుకుచూండగనే ఆయన హోమ ద్రవ్యములకు సాధనమై నందిని అను పేరుతో పిలువబడునట్టి పవిత్రమైన ఆ గోవు వనమునుండి తిరిగి వచ్చినది. 82

చిగురుటాకువలె మెత్తనైనది మొత్తమంతయు ఎర్రగా ఉండి నుదిటి యందు మాత్రము కొంచెముగా వంగిన తెల్లటి వెంట్రుకలు గుర్తును ధరించినది అయిన ఆ ఆవు బాలచంద్రుని ధరించిన సంధ్యా సమయమువలె ప్రకాశించుచున్నది. 83

ఆ నందిని కుండవంటి పొదుగు గలిగినది. బిడ్డను చూచిన ఆనందముతో ఆ పొదుగునకు చేపువచ్చి పాలు ధారలుగా వర్షింపసాగినవి. గోరువెచ్చగనున్న ఆ పాలతో యజ్ఞము పరిసమాప్తమైనపుడు చేయబడు అవభృథ స్నానముకంటె పవిత్రముగ ఆమె భూమిని తడుపుచున్నది. 84

రజః కణైః ఖురోద్ధూతైః
స్పృశద్భి ర్గాత్రమంతికాత్
తీర్థాభిషేకజాం శుద్ధి
మాదధానా మహీక్షితః ॥ 85

తాం పుణ్యదర్శనాం దృష్ట్వా
నిమిత్తజ్ఞ స్తపోనిధిః
యాజ్య మాశంసితా వంధ్య
ప్రార్థనం పునర బ్రవీత్ ॥ 86

అదూర వర్తినీం సిద్ధిం
రాజన్ విగణయాత్మనః
ఉపస్థితేయం కల్యాణీ
నామ్ని కీర్తిత ఏవయత్ ॥ 87

వన్య వృత్తి రిమాం శశ్వ
దాత్మాను గమనేనగాం
విద్యామ భ్యసనేవ
ప్రసాదయితు మర్హసి ॥ 88

నందినీ ధేనువు చేరువైన కొలది ఆమె గిట్టలచే రేగగొట్టబడిన ధూళి కణములు దిలీపుని శరీరమును చుట్టుచు తాకుచున్నవి. పుణ్య జలముల అభిషేకమువలన లభించునట్టి పరిశుద్ధి ఈ గోరజ స్నానము వలన సిద్ధించు చుండగా దిలీపుడు పునీతుడగుచున్నాడు. 85

శకునముల స్వరూప మెరిగినవాడు, తపస్సునకు నిధివంటివాడు అయిన వసిష్ఠ మహర్షి పరమ పుణ్యమైన దర్శనము అనుగ్రహించిన నందిని ధేనువును చూచి ఇక దిలీపుని ప్రార్థన ఫలించగల శుభ సమయ మాసన్న మయినదని గ్రహించి యజమానియైన ఆ మహారాజుతో మరల ఇట్లనెను. 86

ఓ రాజా! మంగళప్రదమైన ఈ ధేనువు తన పేరు తలచితిమో లేదో కన్నుల ముందు నిలిచిన దనగా ఇక నీ మనోరథము సిద్ధించుట అనునది కూడా ఎంతో దూరమున లేదని గ్రహింపుము. 87

వనమునందలి కందమూలములే ఆహారముగ స్వీకరించుచు, అహర్నిశలు నందనిని అనుసరించుచు అభ్యాసము చేత విద్యను ప్రసన్నము చేసికొనినట్లు ఆమెను ప్రసన్నము చేసికొనుము. 88

ప్రస్థితాయాం ప్రతిష్ఠేథాః
స్థితాయాం స్థిత మాచర
నిషణ్ణాయాం నిషీదాస్యాం
పీతాంభసి పి బేరపః ॥ 89

పథూ ర్భక్తిమతీ చైనా
మర్చితా మాతపో వనాత్
ప్రయతా ప్రాతరన్వేతు
సాయం ప్రత్యుద్వ జేదపి ॥ 90

ఇత్యా ప్రసాదా దస్యా స్త్వం
పరిచర్యా పరోభవ
అవిఘ్నమస్తుతే స్యేయాః
పితేవ ధురిపుత్రిణాం ॥ 91

తథేతి ప్రతిజగ్రాహ
ప్రీతిమాంత్సపరిగ్రహః
ఆదేశం దేశకాలజ్ఞః
శిష్య శ్శాసితు రానతః ॥ 92

ఈ ధేనువు నడచిన నడువుము. నిలిచిన నిలువుము. కూర్చుండిన కూర్చుండుము. నీరు త్రాగిన నీరు త్రావుము. 89

నీ భార్య కూడ ఈ దీక్షలో భాగస్వామి కావలెను. ఆమె ధేనువును భక్తితో అర్చించి ఉదయమున తపోవనము వరకు దానిని సాగనంపవలెను. మరల సాయంత్రము తపోవనము వరకు ఎదురేగి ఆ ధేనువును కొని రావలెను. 90

ఈ విధముగా నందిని ప్రసన్నురాలగు వరకును నీవు పరిచర్య చేయుచునే యుండుము. నీకు అవిఘ్నమగు గాక! నీ తండ్రివలె నీవు పుత్రులను పొందిన వారిలో అగ్రేసరుడవు అగుదువు గాక ! 91

సన్నివేశము నడుచుచున్న దేశకాలముల పవిత్రత నెరిగినవాడు, లభించిన తరుణోపాయమునకు ప్రీతి నొందినవాడు అయిన ఆ శిష్యుడు భార్యాసహితుడై నమస్కరించి గురువుయొక్క ఆదేశమును ఆజ్ఞయని స్వీకరించెను. 9

అథ ప్రదోషే దోషజ్ఞః
సంవేశాయ విశాంపతిమ్
సూనుః సూనృత వాక్స్రష్టు
ర్విససర్జోర్జిత శ్రియమ్ ॥ 93

సత్యామపి తపస్సిద్ధౌ
నియ మాపేక్షయా మునిః
కల్పవి త్కల్పయామాస
వన్యామేవాస్య సంవిధామ్ ॥ 94

నిర్దిష్టాం కులపతినా సపర్ణశాలా
మధ్యాస్య ప్రయత పరిగ్రహ ద్వితీయః
తచ్ఛిష్యాధ్యయన నివేదితావసానాం
సం విష్టః కుశశయనే నిశాం నినాయ ॥ 95

ఇది జరిగినది. ఇది జరగవలసినది అని తెలుపగల సత్యవచనుడు, సృష్టికర్త కుమారుడై సంతతిని పొందుటకు మార్గము చూపుచున్న వాడు. ఇది గుణము, ఇది దోషము అని తెలియగల విద్వాంసుడు అయిన వసిష్ఠమహర్షి చీకటి పడుటను గమనించి సకల సంపదలకు ఆలవాలమైన ఆ దిలీప చక్రవర్తిని విశ్రాంతిని తీసుకొనవలసినదిగా ఆనతిచ్చెను. 93

తన తపశ్శక్తితో సకల రాజ భోగములను దిలీపునికై రూపొందింపగల్గిన సమర్థుడైనప్పటికినీ వసిష్ఠ మహర్షి వ్రతవిధానమునకు తగినట్లుగ ఆ మహారాజునకు తపోవన సంబంధమైన ఏర్పాట్లనే చేయించెను. 94

దీక్షితురాలయిన భార్యయే తోడుగా, వసిష్ఠ కులపతిచే నిర్దేశింపబడిన పర్ణశాలయందు దర్భశయనమున నిద్రించిన దిలీపుడు ఆ మహర్షి శిష్యుల వేదాధ్యయనము వినబడుటతో రాత్రి గడచిపోయినదని గ్రహించెను. 95

—•—

# 2

అథ ప్రజానా మధిపః ప్రభాతే
జాయా ప్రతిగ్రాహితగంధమాల్యాం ।
వనాయ ప్రీతప్రతిబద్ధవత్సాం
యశోధనో ధేనో మృషే ర్ముమోచ ॥

తస్యాః ఖురన్యాస పవిత్రపాంసు
మపాంసులానాం ధురి కీర్తనీయా ।
మార్గం మనుష్యేశ్వర ధర్మపత్నీ
శ్రుతేరివార్థం స్మృతి రన్వగచ్ఛత్ ॥

నివర్త్య రాజా దయితాం దయాళు
స్తాం సౌరభేయీం సురభి ర్యశోభిః ।
పయోధరీభూత చతుస్సముద్రాం
జుగోప గోరూప ధరామివోర్వీం ॥

వ్రతాయ తే నానుచరేణ ధేనో
ర్న్యషేధి శేషోఽప్యనుయాయివర్గః ।
న చాన్యత స్తస్య శరీర రక్షా
స్వ వీర్య గుప్తా హి మనోః ప్రసూతిః ॥

# 2

తెల్లవారుచుండగా వ్రతమిక ప్రారంభమైనది. సుదక్షిణాదేవి నంద
నిని గంధమాల్యాదులతో పూజించినది. దూడకు పాలుకుడిపి దూరముగ
కట్టి వైచినది. ప్రజలెల్లరకు ప్రభువు, యశస్సునే ధనముగా భావిచువాడు
అయిన దిలీపుడు ఆ గురుదేవుని ధేనువును అటుపైన అరణ్య విహారమునకై
విడిచిపెట్టెను. 1

దోషమెరుగని వారిలో మొదట లెక్కింపదగిన ఆ సుదక్షిణాదేవి
గిట్టల మోపబడుటతో పవిత్రమగుచున్న ఆ నందనీ ధేనువుయొక్క
మార్గమును వేదార్థమును ధర్మ శాస్త్రమనుసరించినట్లు అనుసరించెను. 2

మనోహరమైన యశస్సుగల అదిలీప మహారాజు దయాళువు. అతడు
ప్రియురాలైన సుదక్షిణాదేవిని వెనుకకు మరలించి నాలుగు సముద్రములను
నాలుగు స్తనములుగా రూపొందగా గోరూపమును ధరించిన భూమినివలె
నందినీ ధేనువును కాపాడుట మొదలిడెను. 3

వ్రతానుష్ఠానమునకై ధేనువును అనుచరునిగ రూపుదాల్చిన దిలీపుడు
తనవెంట వచ్చుచున్న అనుచరులను కూడ నిలిపివేసెను. అతని శరీర
రక్షణము ఇతర మార్గముల వలన సాధ్యమగునదికాదు. మనువు యొక్క
సంతతి స్వశక్తిపైననే ఆధారపడునట్టిది కదా! 4

ఆస్వాద వద్భిః కబళై స్తృణానాం
కండూయనై ర్దంశ నివారణైశ్చ ।
అవ్యాహతైః స్వైర గతైశ్చ తస్యాః
సమ్రాట్ సమారాధన తత్పరోఽభూత్ ॥ 5

స్థితః స్థితా ముచ్చలితః ప్రయాతాం
నిషేదుషీ మాసన బంధధీరః ।
జలాభిలాషీ జలమాదదానాం
ఛాయేవ తాం భూపతి రన్వగచ్ఛత్ ॥ 6

స న్యస్త చిహ్నామపి రాజ్యలక్ష్మీం
తేజో విశేషాను మితాం దధానః ।
ఆసీ దనావిష్కృత దానరాజి
రంతర్మదావస్థ ఇవ ద్విపేంద్రః ॥ 7

లతా ప్రతానో ద్గ్రథితైః స కేశై
రధిజ్య ధన్వావిచచార దావం ।
రక్షాపదేశా న్ముని హోమధేనో
ర్వన్యాన్ వినేష్యన్నివ దుష్టసత్త్వాన్ ॥ 8

సమ్రాట్టయిన ఆ దిలీపుడు నందినిని సేవించుటయందు ఆసక్తుడై రుచికరమైన పచ్చగడ్డిని కబళములుగ ఆమెకు అందించుచుండెను. దురద పుట్టిన చోటుల ఆమెను గోకుచుండెను. ఆమెపై వ్రాలుచున్న ఈగలను తోలుచుండెను సంచారములయందు ఆమె స్వేచ్ఛకు ఏ మాత్రము అడ్డు తగులకుండ జాగ్రత్తపడుచుండెను. 5

ఆ మహారాజు ధేనువు నిలిచిన నిలుచుచు, నడచిన నడుచుచు, కూర్చుండిన కూర్చునుచు, నీరు త్రావిన నీరు త్రావుచు నీడవలె ఆమెను అనుసరించుచుండెను. 6

ఛత్రచామరాది రాజ లాంఛనములను అతడు విడిచిపెట్టినను, అతడి నుండి వ్యక్తమగుచున్న తేజో విశేషమును బట్టి అతడు రాజ్యలక్ష్మిని ధరించుచున్న వాడని ఊహించుటకు వీలు కలుగుచునే ఉన్నది. బహిర్గతముగాని మద జలరేఖ గలిగి లోననే అణగియున్న మదావస్థగల గజేంద్రుని వలె అతడున్నాడు. 7

లతా తంతువులతో పైకెత్తి కట్టబడిన కేశములతో వింటిని ఎక్కుపెట్టి వనమున సంచరించుచున్న దిలీపుడు వసిష్ఠముని హోమధేనువును రక్షించు మిషతో క్రూరమృగములను అదుపులో పెట్టుచున్నాడా అన్నట్లుండెను. 8

విసృష్ట పార్శ్వానుచరస్య తస్య
పార్శ్వద్రుమాః పాశభృతా సమస్య ।
ఉదీరయామాసు రివోన్మదానా
మాలోక శబ్దం వయసాం విరావైః॥ 9

మరుత్ప్రయుక్తాశ్చ మరుత్సఖాభం
తమర్చ్య మారాదభివర్తమానం ।
అవాకిరన్ బాలలతాః ప్రసూనై
రాచారలాజై రివ పౌరకన్యాః ॥ 10

ధనుర్భృతోఽప్యస్య దయార్ద్రభావ
మాఖ్యాత మంతఃకరణై ర్విశంకైః ।
విలోకయంత్యో వపురాపురాక్ష్ణాం
ప్రకామ విస్తార ఫలం హరిణ్యః ॥ 11

సకీచకై ర్మారుత పూర్ణరంధ్రైః
కూజద్భి రాపాదిత వంశకృత్యం ।
శుశ్రావ కుంజేషు యశః స్వముచ్చై
రుద్గీయమానం వనదేవతాభిః ॥ 12

వ్రతవిధానమున కనుగుణముగ దిలీపుడు అనుచరులతో బాటుగ ప్రక్కలనుండి మార్గమును చూపెడి పార్శ్వానుచరులను గూడ మరలించి ధేనువువెంట సంచరించుచున్నాడు. ఆ వనసంచారమున అతనికి ఇరువైపుల వృక్షములున్నవి. ఆ వృక్షములనుండి బలిసిన పక్షుల కూతలు వినబడు చున్నవి. ఆ దృశ్యము చూచుటకు ఆ వృక్షములేపార్శ్వానుచరులై తమను ఆశ్రయించియున్న పక్షులే తమ గొంతులు కాగా, ఇటుచూడుడు, ఇటుచూడు డని వరుణ సమానుడైన అతనికి రాజమర్యాద సలుపుచున్నావా అన్నట్లు ఉన్నది. 9

ఆ వృక్షములకు పెనవేసుకొనియున్న లేత పూల తీగెలు వాయు దేవుని నుండి ప్రోత్సాహమును పొంది, అగ్ని దేవునివలె ప్రకాశించుచు తమ వైపునకు వచ్చుచున్న దిలీపునిపై పురవీధులందుకన్యలు తలంబ్రాలను చల్లినట్లు పూలను చల్లినవి. 10

ధనువును ధరించినప్పటికిని ఆ దిలీపుడు దయార్ద్ర హృదయుడని అంతః కరణములతో గ్రహించిన ఆడు లేళ్ళు ఆ మహారాజును తనివి తీర చూచుచు తమకు విశాలములైన నేత్రములున్నందులకు సార్థకతను అనుభ వించినవి. 11

వాయువుచే పూరింపబడిన రంధ్రములుగల వెదుళ్ళు వేణువులై గానమును వెలువరించున్నవి. ఆ దృశ్యము చూచుటకు పొదరిళ్ళలో నుండి వనదేవతలు దిలీపుని కీర్తిని మనసారా కీర్తించుచున్నట్లున్నది. అట్టి యశోదగానమును వినుచు దిలీపుడు ధేనువు వెంట సంచరించుచుండెను. 12

ప్రత్తస్తుషారైర్గిరి నిర్ఝరాంణా
మనోకహాఒఒకంపిత పుష్పగంధీ ।
తమాతపక్లాంత మనాతపత్ర
మాచార పూతం పవనః సిషేవే ॥ 13

శశామవృష్ట్యాపి వినాదవాగ్నిః
ఆసీద్విశేషాఫలపుష్ప వృద్ధిః ।
ఊనం న సత్వేష్వధికో బబాధే
తస్మిన్ వనం గోప్తుంగాహమానే ॥ 14

సంచార పూతాని దిగంతరాణి
కృత్వాదినాంతే నిలయాయ గంతుం ।
ప్రచక్రమే పల్లవరాగతామ్రా
ప్రభా పతంగస్య మునేశ్చ ధేనుః ॥ 15

తాం దేవతా పిత్రతిథి క్రియార్థా
మన్వగ్యయౌ మధ్యమలోకపాలః ।
బభౌచ సా తేన సతాం మతేన
శ్రద్ధేవ సాక్షా ద్విధినోపపన్నా ॥ 16

వ్రతదీక్షలో పవిత్రుడై యున్న దిలీపుడు గొడుగులేని కారణము చేత ఎండకు బడలినట్లు గమనించిన పవనుడు పర్వతములందలి నదీ ప్రవాహములనుండి చల్లని నీటి తుంపరలను తీసుకొని తనచే కదిలింపబడిన వృక్షములనుండి పుష్ప సుగంధమును జత జేర్చుకొని వచ్చివానిని సేవించెను. 13

రక్షకుడైన దిలీపుడు వన సంచారము ప్రారంభింపగానే దావాగ్ని జలములతో పనిలేకుండ దానికదిగా చల్లారినది. ఫలపుష్పములు వృద్ధి చెందినవి. పెద్ద జంతువులు చిన్న జంతువులను బాధించుట మానినవి. 14

చిగురుటాకులందలి రక్తిమువంటి ఎర్రదనముతో శోభిల్లుచున్న సూర్యకిరణములను, మునిహోమధేనువును తమసంచారములతో దిక్కుల నడిమి ప్రదేశములను పవిత్రవతముచేసి ఇక విశ్రాంతి గొనుటకై ఇంటి ముఖము పట్టినవి. 15

దేవతలకు పితృదేవతలకు మరియు అతిథులకు సంబంధించిన కార్యములకు వినియోగపడునట్టి ఆనందిని ధేనువును మర్త్యలోక పాలకుడైన దిలీపుడు అనుసరించెను. సత్పురుషులకు గౌరవనీయుడైన అతడితో కూడిన ఆ ధేనువు అనుష్ఠానముతో కూడిన సాక్షాత్ శ్రద్ధవలె ప్రకాశించెను. 16

సపల్యా లో త్తీర్ణవరాహయూథా
న్యావాస వృక్షోన్ముఖ బర్హిణాని ।
మయౌ మృగాధ్యాసిత శాద్వలాని
శ్యామాయమానాని వనాని పశ్యన్ ॥ 17

ఆపీన భారో ద్వహన ప్రయత్నాత్
గృష్టిర్గురుత్వా ద్వపుషో నరేంద్రః ।
ఉభావలం చక్రతు రంచితాభ్యాం
తపో వనావృత్తిపథం గతాభ్యాం ॥ 18

వసిష్ఠధేనో రనుయాయినం తం
ఆవర్తమానం వనితా వనాంతాత్ ।
పపౌ నిమేషాలస పక్ష్మ పంక్తిః
ఉపోషితాభ్యామివ లోచనాభ్యాం ॥ 19

పురస్కృతా వర్త్మని పార్థివేన
ప్రత్యుద్గతా పార్థివ ధర్మపత్న్యా ।
తదంతరే సా విరరాజ ధేను
ర్దినక్షపా మధ్యగతేవ సంధ్యా ॥ 20

నీటి పడియల నుండి పందుల గుంపులు పైకి లేచి వచ్చుచున్నవి. నెమిళ్ళ గుంపులు నివాస వృక్షములకు అభిముఖముగా సాగుచున్నవి. లేళ్ళు పచ్చిక బయళ్ళలో గుంపులుగ కూడుచున్నవి. ఈ విధముగా క్రమముగా నల్లబడుచున్న అరణ్యమును చూచుచు దిలీపుడు నందినిని అనుసరించుచుండెను. 17

బరువైన పొదుగును మోయవలసి వచ్చుట వలన, ధేనువును దృఢమైన శరీరమును ధరించుటచేత దిలీపుడును నెమ్మదిగ నడుచుచున్నారు అందమైన వారి నడకలతో మరలి వచ్చుచున్న ఆ ఆశ్రమ మార్గమునకు. వారు అలంకారములై శోభిల్లినారు. 18

వసిష్ఠుని ధేనువైన నందినికి అనుచరుడై వనమునుండి తిరిగి వచ్చుచున్న ఆ దిలీపుని రూపమును చూతపడుటయందు కనురెప్పలు అలసత్వమును వహించుచుండగా ఉపవాసము చేసినవా అన్నట్లున్న కన్నులతో సుదక్షిణాదేవి తనివితీర త్రావెను. 19

దిలీపుడు నందినిని అనుసరించి నడుచుచున్నాడు. ఆ ధేనువునకు ఎదురుగా వచ్చుచున్నది. వారిరువురి మధ్య ఆ ధేనువు పగటికి, రాత్రికి సంధ్యవలె ప్రకాశించినది. 20

ప్రదక్షిణీకృత్వ పయస్వినీం తాం
సుదక్షిణా సాక్షత పాత్రహస్తా ।
ప్రణమ్య చానర్చ విశాల మస్యాః
శృంగాతరం ద్వార మివార్థసిద్ధేః ॥ 21

వత్సోత్సుకాపి స్తిమితా సపర్యాం
ప్రత్యగ్రహీత్సేతి ననందతు స్తౌ ।
భక్త్యోపపన్నే షుహి తద్విధానాం
ప్రసాద చిహ్నాని పురః ఫలాని ॥ 22

గురోః సదారస్య నిపీడ్య పాదౌ
సమాప్య సాంధ్యంచ విధిం దిలీపః ।
దోహావసానే పునరేవ దోగ్ధ్రీం
భేజే భుజోచ్ఛిన్నరిపు ర్నిషణ్ణాం ॥ 23

తామంతికన్య స్త బలిప్రదీపా
మన్వాస్యగోప్తా గృహిణీ సహాయః ॥
క్రమేణ సుప్తా మనుసంవివేశ
సుప్తోత్థితాం ప్రాత రనూదతిష్ఠత్ ॥ 24

క్షీరమునకు నిలయమైన ఆ నందినికి అక్షతల పాత్రను చేతబట్టిన సుదక్షిణాదేవి ప్రదక్షిణము చేసి నమస్కరించి ఆ ధేనువు యొక్క కొమ్ముల నడిమి భాగమును తన కార్యసిద్ధికి ద్వారముగ దర్శించి పూజించినది. 21

బిడ్డను చేరవలెనన్న ఉత్సాహములో నున్నప్పటికిని, నందిని, తాము చేయుచున్న సపర్యలను సస్మితముగా స్వీకరించినదని ఆ దంపతులు ఆనందించిరి. నందినీ ధేనువు వంటి పుణ్యమూర్తురాలు తమ యెడల భక్తి ప్రపత్తులుగల వారివల్ల అనుగ్రహచిహ్నములను ఇట్లు వ్యక్తము చేయుట, వారికి కార్యసిద్ధి సమీపములోనున్నదని సూచించుచున్నది కదా ! 22

తన భుజబలముచే శత్రువులను నిర్జించిన దిలీపుడు, సతీసమేతుడై యున్న గురుదేవుని పాదములకు నమస్కరించి, సంధ్యా సమయమునకు సంబంధించిన విధులను నిర్వర్తించి, పాలు పితుకుట ముగిసినంతట ఘరుండియున్న నందినీధేనువునే మరల సేవించసాగెను. 2[illegible]

సుదక్షిణాదేవి తోడు కాగా రక్షకుడగు ఆ దిలీపుడు నందిని కావలెనను కొనినపుడు స్వీకరించుటకు వీలున ఆమెకు అందుబాటులో నుండునట్లుగ ఆహారమును అమర్చి వెలుగు కొరకు ఆ ప్రక్కగా ఒక దీపమును కూడ నిలిపెను. క్రమముగా ధేనువు నిదురలోనికి ప్రవేశింపగా తానును నిదురించుటకు ఉపక్రమించెను. ఆమె మేల్కాంచగనే తాను మేల్కాంచెను.

ఇత్థం వ్రతం ధారయతః ప్రజార్థం
సమం మహిష్యా మహనీయ కీర్తేః ।
సప్తవ్యతీయు స్త్రిగుణాని తస్య
దినాని దీనోద్ధరణోచితస్య ॥ 25

అన్యేద్యు రాత్మానుచరస్య భావం
జిజ్ఞాసమానా మునిహోమధేనుః ।
గంగాప్రపాతాంత విరూఢ ఘాసం
గౌరీగురో ర్గహ్వర మావివేశ ॥ 26

సా దుష్ప్రధర్షా మనసాపి హింస్రై
రిత్యద్రిశోభా ప్రహితేక్షణేన ।
అలక్షితాభ్యుత్పతనో నృపేణ
ప్రసహ్య సింహః కిల తాం చకర్ష ॥ 27

తదీయ మాక్రందిత మార్తసాధో
ర్గుహానిబద్ధ ప్రతిశబ్ద దీర్ఘం
రశ్మిష్వివాదాయ నగేంద్రసక్తాం
నివర్తయామాస నృపస్య దృష్టిం ॥ 28

మహనీయమైన కీర్తికి ఆలవాలమైన వాడు, పీడితులను రక్షించుటలో యోగ్యుడు అయిన దిలీప మహారాజు సంతానార్థమై ప్రతీనమేతుడై ప్రారంభించిన వ్రతదీక్షలో ఈ విధముగా ఇరువదియొక్క దినములు గడచిపోయెను. 25

మరునాడు వసిష్ఠముని యొక్క హోమధేనువులైన నంధిని తనను అనుసరించుచున్న దిలీప మహారాజు యొక్క నిజస్థితిని తెలియగోరి గంగా నది, క్రిందకు పడుచున్నట్టి ప్రాంతమునకు చేరువలో గల పచ్చిక బాగుగా పెరిగిన ఒక హిమాలయ గుహలోనికి ప్రవేశించెను. 26

క్రూర మృగములు ఈ నందినీ ధేనువును హింసించుటను గూర్చి మనస్సున గూడ ఊహించలేవన్న నమ్మకముగల దిలీపుడు పర్వత సౌందర్యమును తిలకించుచు పారవశ్యమున ఉండగా, ఇంతలో ఆ మహారాజు గమనికకు అందకుండగనే సింహమొకటి ధేనువుపై ఉరికి ఆమెను పట్టి లాగనే లాగినది. 27

అంతట ఆ నందినీ ధేనువు చేసిన ఆక్రందనములలో ప్రతిధ్వనించి పెద్ద యెత్తున వెలుపడుచు పర్వత సౌందర్యమును తిలకించుటలో నిమగ్నమైయున్న ఆపద్బాంధవుడగు ఆ దిలీపుని దృష్టిని పగ్గములతో పట్టి లాగినట్లు వెనుకకు మరల్చెను. 28

స పాటలాయాం గవితస్థివాంసం
ధనుర్ధరః కేసరిణం దదర్శ
అధిత్యకాయామివ ధాతుమయ్యాం
లోధ్రద్రుమం సానుమతః ప్రఫుల్లమ్ ॥ 29

తతో మృగేంద్రస్య మృగేంద్రగామీ
వధాయ వధ్యస్య శరం శరణ్యః ।
జాతాభిషంగో నృపతి ర్నిషంగా
దుద్ధర్తు మైచ్ఛత్ప్రసభో ద్ధృతారిః ॥ 30

వామేతర స్తస్య కరః ప్రహర్తు
ర్నఖ ప్రభాభూషిత కంకపత్రే
సక్తాంగుళిః సాయక పుంఖఏవ
చిత్రార్పితారంభ ఇవావతస్థే ॥ 31

బాహు ప్రతిష్టంభ వివృద్ధమన్యు
రభ్యర్ణమాగస్కృత మస్పృశద్భిః ।
రాజా స్వతేజోభి రదహ్యతాంత
ర్భోగీవ మంత్రౌషధ రుద్ధ వీర్యః ॥ 32

వింటిని ధరించియున్న దిలీపుడు ఎర్రనైన ఆ ధేనువుపై సింహ మొకటి కూర్చుండియున్నటుల గమనించెను. అది ఆ పర్వతము యొక్క ఎర్రని కొండచరియపై తెల్లగ విరియబూసిన లొద్దుగ చెట్టువలె నున్నది. 29

సింహము నడకవంటి నడక గలవాడును, ఆర్తులను రక్షించుట స్వభావముగ గలవాడును, బలాత్కారముగ పెకలింపబడిన శత్రువులు గల వాడును అయిన దిలీప మహారాజు తానుండగా వసిష్ఠముని ధేనువునకు ఆపదగలిగినందులకు అవమానమును అనుభవించుచు సంహరింపదగిన సింహముయొక్క సంహారమునకై అమ్ములపొది నుండి అమ్మును పైకిదీయ గోరెను. 30

అమ్ముల పొదినుండి అమ్మునుదీయుటకై పైకెత్తబడిన అతని కుడి చేయి ఆ గోళ్ళకాంతులు వ్యాపించుటచే రాణిల్లుచున్న ఈకలు గల బాణపు పిడియందే అంటుకొనిపోయిన వ్రేళ్ళు గలదై చిత్తరువునందు గీయబడి నట్లుగ అట్లే నిలిచిపోయినది. 31

భుజము స్తంభించి పోవుటతో దిలీపునికి కోపము మరింత పెరిగినది. కాని అతడు తానెంత సమర్థుడైనప్పటికిని ఎదుటనున్న అపరాధిని తాకలేక పోవుచుండెను. మంత్రౌషధాదులచే అరికట్టబడిన సామర్థ్యముగల సర్పము వలె అతడు లోలోపల దహించుకొని పోవుచుండెను. 32

తమార్యగృహ్యం నిగృహీతధేను
ర్మనుష్యవాచా మనువంశకేతుం ।
విస్మాయయన్ విస్మిత మాతృవృత్తౌ
సింహోరుసత్త్వం నిజగాద సింహః ॥ 33

అలం మహీపాల తవ శ్రమేణ
ప్రయుక్త మప్యస్త్రమితో వృథా స్యాత్ ।
నపాదపోన్మూలన శక్తిరంహః
శిలోచ్చయే మూర్ఛతి మారుతస్య ॥ 34

కైలాసగౌరం వృషమారురుక్షోః
పాదార్పణానుగ్రహ పూత పృష్ఠమ్ ।
అవేహి మాం కింకర మష్టమూర్తేః
కుంభోదరం నామ నికుంభతుల్యమ్ ॥ 35

అముంపురః పశ్యసి దేవదారుం
పుత్రీకృతోఽసౌ వృషభధ్వజేన ।
యో హేమకుంభ స్తన నిస్సృతానాం
స్కందస్య మాతుః పయసాం రసజ్ఞః ॥ 36

సాధువుల పక్షము పూనుట తన స్వభావముగా గలవాడు, మనువంశ మను రథమునకు ధ్వజమువంటివాడు, బలమున సింహ సమానుడు అయిన దిలీపుడు తన ప్రస్తుత స్థితికి ఆశ్చర్యపడుచుండగా ధేనువును ఒడిసి పట్టు కొనిన ఆ సింహము అతడిని మరింత ఆశ్చర్యపరచుచు మానవ భాషలో ఇట్లు పలికెను. 33

ఓరాజా. ఎవ్వ పడుచున్న శ్రమ ఇక చాలును! నీవాకవేళ బాణము ప్రయోగించగలిగినను అది వ్యర్థమే కాగలదు. వృక్షములను సమూలముగ పెళ్ళగించగలిగిన వాయువుయొక్క వేగము పర్వతములను ఏమాత్రము కదల్పలేదు కదా! 34

ఓ రాజా! నన్ను పరమశివుని సేవకునిగా తెలిసికొనుము. శివుని కింకరులలో నికుంభుడని యున్నాడు కదా! అతనితో సమానమైన ప్రతి పత్తి గల కుంభోదరుడనువాడను నేను. కైలాసగిరివలె తెల్లనైన నందీ శ్వరుని ఆరోహించువేళ ఆ అష్టమూర్తి నా వీపునె తన పాదపీఠిగ స్వీక రించును. 35

ఇదిగో! ఎదురుగా కనబడుచున్న ఈ దేవదారు వృక్షమును చూచు చున్నావుకదా! స్కంధమాత అయిన పార్వతీదేవి తన స్తనములవంటి బంగారు కడవలతో స్వయముగ పోసిన జలముల రుచిని అనుభవించుచు పెరిగి పెద్దయిన వృక్షమిది. పరమ శివునిచే పుత్రునిగ స్వీకరింపబడినది. 36

కండూయమానేన కటం కదాచి
ద్వన్యద్విపేనోన్మథితా త్వగస్యాః ।
అథైన మద్రే స్తనయా శుశోచ
సేనాన్యమాలీఢ మివాసురాస్త్రైః ॥ 37

తదా ప్రభృత్యేవ వనద్విపానాం
త్రాసార్థ మస్మిన్నహ మద్రికుక్షౌ ।
వ్యాపారిత శ్శూలభృతా విధాయ
సింహత్వ మంకాగత సత్త్వవృత్తి ॥ 38

తస్యాలమేషా క్షుధితస్య తృప్త్యై
ప్రదిష్టకాలా పరమేశ్వరేణ ।
ఉపస్థితా శోణిత పారణా మే
సురద్విష శ్చాంద్రమసీ సుధేవ ॥ 39

స త్వం నివర్తస్వ విహాయ లజ్జాం
గురోర్భవాన్ దర్శిత శిష్యభక్తిః ।
శస్త్రేణ రక్ష్యం యదశక్యరక్షం
సతద్యశః శస్త్రభృతాం క్షిణోతి ॥ 40

ఒకానొకప్పుడు మదపుటేనుగొకటి దురదపెట్టిన తన చెక్కిలిని రుద్దుకొనగా ఈ వృక్షముయొక్క చర్మము కొంత రేగినది. అప్పుడు పార్వతీదేవి రాక్షసుల బాణములకు గురియైన కుమారస్వామిని చూచి శోకించినట్లు దీనిని చూచి శోకించెను. 37

నాటినుండి శూలధారి అడవి యేనుగులను భయపెట్టు నిమిత్తము నాకు సింహపు రూపునిచ్చి ఈ కొండగుహలో ఇచ్చట నన్ను నియమించెను. చేరువకు వచ్చిన జంతువులను ఆహారముగ స్వీకరించునట్లుగ ఏర్పాటు కావించెను. 38

భోజన సమయమునకు పరమేశ్వరునిచే పంపబడిన రక్తభోజనమి, దేవతల విరోధియైన రాహువునకు చంద్రుని యందలి అమృతమువ ఆకలిగొన్న నాకు తృప్తి కలిగించుటకు ఈ ధేనువు చాలును. 39

నీవిక వెళ్ళిరమ్ము! సిగ్గు పడకుము. శిష్యునిగ గురువు యెడల ప్రకటింపవలసిన భక్తిని ప్రకటించితివి. ఏ వస్తువును శస్త్రముచేత రక్షించుటకు వలనుపడదో దానిని రక్షింపలేకపోవుట శస్త్రధారులకు అవమానము కానేరదు. ఇంత మాత్రమున వారి కీర్తి ఏమాత్రము తగ్గదు. 40

ఇతి ప్రగల్భం పురుషాధిరాజో
మృగాధిరాజస్య వచో నిశమ్య ।
ప్రత్యాహతాస్త్రో గిరిశ ప్రభావా
దాత్మన్యవజ్ఞాం శిథిలీ చకార ॥ 41

ప్రత్యబ్రవీ చ్చైవ మిషుప్రయోగే
తత్పూర్వ సంగే వితథ ప్రయత్నః ।
జడీకృత స్త్ర్యంబక వీక్షణేన
వజ్రం ముముక్షన్నివ వజ్రపాణిః ॥ 42

సంరుద్ధ చేష్టస్య మృగేంద్ర కామం
హాస్యం వచ స్తద్యదహం వివక్షుః ।
అంతర్గతం ప్రాణభృతాం హి వేద
సర్వం భవాన్ భావమతోఽభిధాస్యే ॥ 43

మాన్య స్సమే స్థావరజంగమానాం
సర్గ స్థితి ప్రత్యవహార హేతుః ।
గురోరపీదం ధన మాహితాగ్నే
ర్నశ్య త్పురస్తా దనుపేక్షణీయమ్ ॥ 44

మృగరాజు ఈ విధముగా చెప్పగా విని ఆ మానవాధిపతి తన కిట్లు జరుగుటకు కారణము శివుని ప్రభావమేయని యెగిరి తనయందు తనకు గలిగిన అవమాన భావమును సడలించుకొనెను. 41

బాణమును ప్రయోగింపబోయి భంగపడుట అనునది అతడి కిదే మొదటిసారి. వజ్రాయుధమును ప్రయోగింపబోవుచు శివుని వీక్షణమునకు స్తంభించిపోయిన ఇంద్రునివలెనున్న ఆ దిలీపుడు సింహము నుద్దేశించి ఇట్లు బదులు పలికెను. 42

ఈ విధముగా చేష్టలుడుగుకున్నట్లు చేయబడిన నేను ఏమి చెప్పినను అది పరిహాసాస్పదముగనే ఉండును. కాని సర్వజీవుల అంతరంగము లందలి అభిప్రాయములన్నియు ముందుగనే ఎరుగ గలవాడవు నీవు. నా నిజస్థితిని గ్రహింపగలవు. కనుకనే నీకు చెప్పుచున్నాను. 43

సృష్టి, స్థితి, లయములకు కారకుడైన ఆ పరమేశ్వరుడు నాకును పూజ్యుడే. ఆహితాగ్నియైన గురుదేవుని ధనము కంటి యెదుట నశించు చుండుటయు ఉపేక్షింప దగినది కాదు. 44

స త్వం మదీయేన శరీరవృత్తిం
దేహేన నిర్వర్తయితుం ప్రసీద ।
దినావసానోత్సుక బాలవత్సా
విసృజ్యతాం ధేను రియం మహర్షేః ॥ 45

అథాంధకారం గిరిగహ్వరాణాం
దంష్ట్రామయూఖై శ్శకలానికుర్వన్ ।
భూయస్స భూతేశ్వర పార్శ్వవర్తీ
కించి ద్విహస్యార్థపతిం బభాషే ॥ 46

ఏకాతపత్రం జగతః ప్రభుత్వం
నవం వయః కాంత మిదం వపుశ్చ ।
అల్పస్య హేతో ర్బహుహాతు మిచ్ఛన్
విచారమూఢః ప్రతిభాసి మే త్వం ॥ 47

భూతానుకంపా తవ చేదియం గౌ
రేకాభవేత్ స్వస్తిమతీ త్వదంతే ।
జీవన్పునః శశ్వదుపప్లవేభ్యః
ప్రజాః ప్రజానాథ పితేవపాసి ॥ 48

కావున నీవు నన్ననుగ్రహించి నా దేహమును నీ ఆహారముగ స్వీకరించి శరీరమును నిలుపుకొనుము. సాయంకాలం మెప్పుడగు నాయని ఎదురు చూచుచున్న లేగదూడగల ఈ ముని ధేనువును మాత్రము విడిచిపెట్టుము. 45

ఆ మాటలను విని సింహము రూపమున నున్న ఆ శివకింకరుడు తన కోరల కాంతులచే పర్వతగుహాల యందలి చీకటులను చీల్చుచు ఒక చిరునవ్వు నవ్వి మహారాజుతో మరల ఇట్లనెను. 46

ఈ కనిపించుచున్న జగత్తునకు నీవు ఏక ఛత్రాధిపతివి. సుఖభోగములను తృప్తిగ అనుభవింపవలసిన నవయౌవనము, సుందరమగు శరీరము నీకున్నవి. ఇట్టివాని నన్నింటిని ఈ చిన్న ప్రయోజనమునకై విడిచి పెట్టగోరుచున్న నీవు విచక్షణా జ్ఞానము లేనివాడవుగ నాకు కనుపించుచున్నావు. 47

ఓ దిలీప మహారాజా! నీ విప్పుడు భూతదయతో గోవునకు బదులు శాకాహారమై నశించెదవేని నీ తరువాత ఈ గోవు మాత్రమే క్షేమముగా నుండగలదు. మరి జీవించి యుండుటకు అంగీకరించెదవేని తండ్రివలె ప్రజలెల్లరను అనేక ఉపద్రవములనుండి చిరకాలము రక్షింపగలవు. 48

అథైకధేనో రపరాధచండా
ద్గురోః కృశాను ప్రతిమాద్బిభేషి ।
శక్యోఽస్య మన్యు ర్భవతా వినేతుం
గాః కోటిశః స్పర్శయతా ఘటోధ్నీః 49

తద్రక్ష కల్యాణ పరంపరాణాం
భోక్తార మూర్జస్వల మాత్మదేహం ।
మహీతల స్పర్శనమాత్రభిన్న
మృద్ధం హి రాజ్యం పద మైంద్రమాహుః ॥ 50

ఏతావదుక్త్వా విరతే మృగేంద్రే
ప్రతి స్వనేనాస్య గుహాగతేన
శిలోచ్చయోఽపి క్షితిపాల ముచ్చైః
ప్రీత్యా తమేవార్థ మభాషతేవ ॥ 51

నిశమ్య దేవానుచరస్య వాచం
మనుష్యదేవః పునరప్యువాచ ।
ధేన్వా తదధ్యాసిత కాతరాక్ష్యా
నిరీక్ష్యమాణః సుతరాం దయాళుః ॥ 52

నీ గురుదేవునకు ఉన్నది ఈ ధేనువు వొక్కటే కదా! అట్టి దీని యెడల అపరాధము జరిగినచో అతడు అగ్నివలె మండిపడునని భయపడు చున్నావా! అంతగా భయపడవలసిన పనిలేదు. కుండ పొదుగులు గల గోవులను కోట్లకొలదిగ సమర్పించి నీవా కోపమును పోగొట్టగలవు. 49

కావున శుభపరంపరలను అనుభవింపగల సమర్థమైన ఈ నీ దేహమును కాపాడుకొనుము. నిండైన రాచరికము భూమిని స్పృశించుటలో మాత్రమే ఇంద్రపదవికన్న వేరగుచున్నదని చెప్పుదురుగదా ! 50

సింహము ఇట్లు పలికి దిలీపునివైపు చూచుచుండగా ఆ సింహము పలికిన పలుకులు గుహలలో ప్రతిధ్వనించి మరింత పెద్దగా వినబడసాగినవి. దిలీపునిపైగల ప్రేమతో గిరిరాజు కూడ మృగరాజు వాక్కులనే మరల నొక్క చెప్పుచున్నాడా! అన్నట్లున్నది ఆ దృశ్యము. 51

శివానుచరుడైన ఆ సింహము పలికిన పలుకులను విని దానిచే పొదివి పట్టుకొనబడి దీనముగా బెదురు చూపులు చూచుచున్న ఆ ధేనువును గమనించుచు దయార్ద్ర హృదయుడైన ఆ మానవేశ్వరుడు సింహమున కిట్లు మారు పలికెను. 52

క్షతాత్కిల త్రాయత ఇత్యుదగ్రః
క్షత్రస్య శబ్దో భువనేషు రూఢః
రాజ్యేన కిం తద్విపరీతవృత్తేః
ప్రాణై రుపక్రోశమలీమసైర్వా ॥ 53

కథం ను శక్యోఽనునయో మహర్షే
ర్విశ్రాణనాదన్య పయస్వినీనామ్
ఇమా మనూనాం సురభే రవేహి
రుద్రౌజసాతు ప్రహృతం త్వయాస్యామ్ ॥ 54

సేయం స్వదేహార్పణ నిష్క్రయేణ
న్యాయ్యా మయామోచయితుం భవత్తః ।
న పారణాస్యా ద్విహతా తవైవం
భవే దలుప్తశ్చ మునేః క్రియార్థః ॥ 55

భవా నపీదం పరవానవైతి
మహాన్ హి యత్న స్తవ దేవదారౌ ।
స్థాతుం నియోక్తు ర్నహి శక్య మగ్రే
వినాశ్య రక్ష్యం స్వయ మక్షతేన ॥ 56

దెబ్బనుండి రక్షించునది, దెబ్బ తినకుండ చూచునది అనికదా క్షత్రియ శబ్దమునకు అర్థము! లోకములన్నింటియందను ఆ పదమునకు అర్థము అట్లు రూఢమై యున్నదికదా! అందుకు విరుద్ధముగ ప్రవర్తించినప్పుడు నేనిక క్షత్రియుడనెట్లగుదను? క్షత్రియుని కానినాడు ఈ రాజ్యముతో నాకేమి పని? నిందచేత మలినమైన ఈ ప్రాణములతో మాత్రము నాకేమి పని? 53

ఇతరములగు పాడియావులను సమర్పించుట వలన మహర్షిని శాంతపరచుట ఎట్లు సాధ్యమగును? ఈ నందిని కామధేనువుకన్న ఏ మాత్రము తక్కువది కాదని తెలిసికొనుము! ఆ పరమేశ్వరుని మహిమ వలన మాత్రమే దీనిని ఆక్రమించుట నీకు సాధ్యమైనదని గూడ గ్రహించుము. 54

అట్టి ఈ ధేనువు, నా శరీరమును సమర్పించుట యనెడి వెల యిచ్చి అయినను నీనుండి విడిపింపదగినది. ఇట్లు చేయుట వలన నీ భోజనమునకును భంగము వాటిల్లదు. మహర్షి యొక్క హోమ ద్రవ్యమునకు గూడ లోపము జరుగదు. 55

నీవు కూడ పరాధీనుడవే! సేవకుని ధర్మము నీకు తెలియనిది కాదు. ఈ దేవదారు వృక్షము విషయమున నీవు చేయుచున్న ప్రయత్నము ఎంతటి గొప్పది! సేవకుడైనవాడు రక్షింపవలసినవానిని నాశము గావించి తానుమాత్రము గాయపడకుండ స్వామి ఎదుట నిలుచుట భావ్యమా? నిలుచుట సాధ్యమా? 56

కిమప్య హింస్య స్తవ చే న్మతోఽహం
యశశ్శరీరే భవమే దయాళుః ।
ఏకాంతవిధ్వంసిషు మ ద్విధానాం
పిండే ష్వనాస్థాఖలు భౌతికేషు ॥ 57

సంబంధమాభాషణ పూర్వమాహుః
వృత్తస్స నౌ సంగతయో ర్వనాంతే ।
తద్భూత నాథానుగనార్హసిత్వం
సంబంధినో మే ప్రణయం విహంతుం ॥ 58

తథేతి గాం ముక్తవతే దిలీపః
సద్యః ప్రతిష్టంభ విముక్తబాహుః ।
సన్యస్త శస్త్రో హరయే స్వదేహ
ముపానయత్ పిండమివామిషస్య ॥ 59

తస్మిన్ క్షణే పాలయితుః ప్రజానా
ముత్పశ్యతః సింహ నిపాత ముగ్రం ।
అవాఙ్ముఖస్యోపరి పుష్పవృష్టిః
పపాత విద్యాధర హస్తముక్తా ॥ 60

అట్లుగాక చంపదగినవానినిగ నేను నీకు కనిపించకున్నచో ఆ దయను నీవు నా యశశ్శరీరముపై చూపుము. ఎప్పటికైన నశించిపోయెడి భౌతిక శరీరములపై నావంటి వారికి ఆసక్తి ఉండదుకదా ! 57

సంభాషణమే మైత్రికి మూలకారణ మందురు. ఈ అడవిలో తారసపడిన మనకు అట్టి మైత్రి చిత్రముగా సిద్ధించినది. కనుక ఓ శివాను చరా ! నీ మిత్రుడనగు నా కోరికను త్రోసిపుచ్చుట నీకు యుక్తముకాదు సుమా ! 58

మిత్రుని ప్రార్థనకు ప్రసన్నమగుచు అట్లేయని సింహము ఆ గోవును విడిచి పుచ్చెను. ఆ క్షణముననే బాణపు పిడికి అంటుకొని పోయిన దిలీపుని కరాంగుళులు కదలి అతడి శరీరము అతడి వశమునకు వచ్చెను. వెను వెంటనే అతడు ఆయుధములను విడిచిపెట్టి తన శరీరమును ఒక మాంసపు ముద్దవలె ఆ సింహమునకు సమర్పించుకొనెను. 59

తలను క్రిందకు వంచుకొని ఉగ్రమైన ఆ సింహము మీద పడుటను గూర్చి దిలీపుడు ఎదురుచూచుచున్న ఆ క్షణమున విద్యాధరులు అతడిపై పుష్ప వర్షమును కురిపించిరి. 60

ఉత్తిష్ఠవత్సేత్యమృతాయమానం
వచో నిశమ్యోత్థిత ముత్థితస్సన్ ।
దదర్శ రాజా జననీ మివ స్వాం
గా మగ్రతః ప్రస్రవిణీం న సింహమ్ ॥ **61**

తం విస్మితం ధేను రువాచ సాధో
మాయాం మయోద్భావ్య పరీక్షితోఽసి ।
ఋషి ప్రభావా న్మయి నాంతకోఽపి
ప్రభుః ప్రహర్తుం కిముతాన్యహింస్రాః ॥ **62**

భక్త్యా గురౌ మయ్యనుకంపయా చ
ప్రీతాస్మి తే పుత్రవరం వృణీష్వ ।
న కేవలానాం పయసాం ప్రసూతి
మవేహి మాం కామదుఘాం ప్రసన్నామ్ ॥ **63**

తత స్సమానీయ సమానితార్థే
హస్తౌ స్వహస్తార్జిత వీరశబ్దః ।
వంశస్య కర్తార మనంతకీర్తిం
సుదక్షిణాయాం తనయం యయాచే ॥ **64**

అంతలో బిడ్డా లెమ్మని అమృతోపమానమైన మాట యొకటి విన బడెను. అతడు పైకి లేచి చూచెను. క్షీరమును స్రవించుచు నందిని తన తల్లివలె ఎదుట నిలిబడియుండెను. సింహ మచట కనుపింపలేదు. ఆశ్చర్యము ! 61

ఆశ్చర్యమునకు లోనయిన దిలీపుని చూచి నందనీధేనువు ఇట్లు పలికెను; ఓ సహృదయుడా! నిన్ను పరీక్షించుట కొరకై నాచే కల్పింప బడిన మాయ ఇది. మహర్షి యొక్క మహిమ వలన యముడు కూడ నన్ను తాకలేడు సుమా ! ఇక ఇతరములగు క్రూర మృగముల మాట చెప్పవలెనా ? 62

కుమారా ! నీకు గల గురు భక్తికి, నాయందు నీవు చూపిన దయా విశేషమునకు చాల సంతోషమైనది. కావలసిన వరమును కోరుకొనుము. నన్ను పాలను మాత్రమే ఇచ్చుదానినిగా తలంపకుము. అనుగ్రహించిన వేళ అనగా నేను కనికరించిన వేళ అనగా నేను కనికరించినవేళ కోరికలనే నా నుండి పిదుకుకొనవచ్చునని తెలియుము. 63

ఆ చేతుల మీదుగా ఎందరెందరో అర్థులను తానుగా మన్నించి తృప్తిపరచినవాడు, ఆ చేతుల మీదుగా తన పరాక్రమమును చూపి వీరు డను బిరుదమును తానుగా ఆర్జించుకొనినవాడు అయిన ఆ దిలీపమహారాజు ఆ చేతులను జోడించి వంశకర్తయు, అనంత కీర్తియు అయిన పుత్రుని సుదక్షిణాదేవియందు తనకు అనుగ్రహింపుమని ఆధేనువును అర్థిం చెను. 64

సంతాన కామాయ తథేతి కామం
రాజ్ఞే ప్రతిశ్రుత్య పయస్వినీ సా ।
దుగ్ధ్వా పయః పత్రపుటే మదీయం
పుత్రోపభుంక్ష్వేతి తమాదిదేశ ॥ 65

వత్సస్య హోమార్థ విధేశ్చశేషం
గురోరనుజ్ఞా మధిగమ్య మాతః ।
ఊధస్య మిచ్ఛామి తవోప భోక్తుం
షష్ఠాంశ ముర్వ్యాఇవ రక్షితాయాః ॥ 66

ఇత్థం క్షితీశేన వసిష్ఠధేను
ర్విజ్ఞాపితా ప్రీతతరాబభూవ ।
తదన్వితా హైమవతాత్ చకుక్షేః
ప్రత్యాయయా వాశ్రమ మిశ్రమేణ ॥ 67

తస్యాః ప్రసన్నేందుముఖః ప్రసాదం
గురు ర్నృపాణాం గురవే నివేద్య ।
ప్రహర్ష చిహ్నానుమితం ప్రియాయై
శశంస వాచా పునరుక్తమేవ ॥ 68

దివ్యమగు క్షీరమునకు నిలయమగు ఆ నందిని సంతానమును కోరి నిలిచిన రాజునకు ఆప్లేయని మాటనిచ్చి, "కుమార! ఒక ఆకు దొన్నె లోనికి నా పాలను పిండుకొని త్రావుము" అని అతనిని ఆజ్ఞాపించెను. 65

తల్లీ! దూడను ముందు పాలు కుడవనిమ్ము. ఆశ్రమమునందలి హోమ క్రియలకు కావలసిన క్షీరమును గూడ వినియోగింపనిమ్ము. ఆపైన, మిగిలిన పాలను గురుదేవుని అనుమతితో నాచే రక్షింపబడుచున్న భూమి యందలి సంపద నుండి ఆరవ పాలును స్వీకరించినట్లు స్వీకరింపగోరు చున్నాను. 66

రాజిట్లు విన్నవింపగా ఆ వినయ విధేయతలకు వసిష్ఠుని ధేనువు నకు మిక్కిలి సంతసమాయెను. అతనితో కూడినదై ఆ హిమవత్పర్వతపు గుహనుండి అనాయాసముగ అనతి కాలమున ఆశ్రమమునకు చేరు కొనెను. 67

ఆ రాజశ్రేష్ఠుడు వికసించుచున్న చంద్రబింబమువంటి ముఖముతో చూచుటకు ముచ్చటగొలుపుచున్నాడు. అతడినుండి వ్యక్తమగుచున్న సంతోషచిహ్నములను గమనించిన వారెవరైనా నందనీధేనువుయొక్క అను గ్రహము అతడిపై ప్రసరించినదని ఇట్టె ఊహింపగలరు. తెలిసిన దానినే మరల తెలియబరచుచున్నాడా యన్నట్లుగ అతడు జరిగిన దానిని గురుదేవు డైన వసిష్ఠమునికి చెప్పి, ఆపైన తన ప్రియురాలైన సుదక్షిణాదేవికి కూడ వివరించెను. 68

సనందినీ స్తన్య మనిందితాత్మా
సద్వత్సలో వత్స హుతావశేషం ।
పపౌ వసిష్ఠేన కృతాభ్యనుజ్ఞం
శుభ్రం యశోమూర్త మివాతి తృష్ణః ॥ 69

ప్రాతర్యథోక్త వ్రతపారణాన్తే
ప్రాస్థానికం స్వస్త్యయనం ప్రయుజ్య ।
తౌ దంపతీ స్వాం ప్రతిరాజధానీం
ప్రస్థాపయామాస వశీ వసిష్ఠః ॥ 70

ప్రదక్షిణీకృత్య హుతంహుతాశన
మనంతరం భర్తు రరుంధతీం చ ।
ధేనుం సవత్సాం చ నృపః ప్రతస్థే
సన్మంగళోదగ్రతర ప్రభావః ॥ 71

శ్రోత్రాభిరామ ధ్వనినా రథేన
సధర్మపత్నీ సహితః సహిష్ణుః ।
యయావనుద్ఘాత సుఖేనమార్గం
స్వేనేవ పూర్ణేవ మనోరథేన ॥ 72

దోషరహితుడు, సాధువత్సలుడు అయిన దిలీపుడు వసిష్ఠ మహర్షి అనుమతిని పొందినవాడై దూడ త్రాగగా, హోమము చేయబడగా మిగిలిన పాలను నిర్మలమై, రూపు కట్టిన తన కీర్తిని త్రావుచున్నాడా యన్నట్లు మిక్కిలి కోరికతో త్రాగెను. 69

అటుపైన నియతాత్ముడైన ఆ వసిష్ఠమహర్షి ఇప్పటివరకు నిర్వహింపబడిన గోసేవా వ్రతమునకు సంబంధించిన పారణము ముగిసిన పిదప ప్రయాణోచితమైన ఆశీస్సులను కూడ అందించి సుదక్షిణా దిలీపులను ఇక రాజధానికి బయలుదేరదీసెను. 70

సుదక్షిణాదేవితో కూడుకొనిన దిలీపుడు హవిస్సుచే ప్రజ్వరిల్ల చేయబడిన అగ్నికిని, అరుంధతీదేవితో కూడుకొనిన వసిష్ఠునకును, వత్సముతో కూడిన నందినీ ధేనువునకును ప్రదక్షిణ నమస్కారములాచరించి ఆ శుభకర్మాచరణలో ఉత్కృష్టమైన ప్రభావమును పొందినవాడై రాజధాని వైపునకు బయలుదేరెను. 71

సహనశీలియైన ఆ దిలీపుడు సుదక్షిణాసమేతుడై రథమును ఆరోహించెను. రథము కదలెను. ఆ రథ ధ్వని వినసొంపుగానుండెను. కుదుపులు ఏమాత్రము లేవు. సఫలమైన తన మనోరథము వలె నున్న ఆ రథయానమున సుఖించుచు అతడు ప్రయాణించెను. 72

తమాహితౌత్సుక్య మదర్శనేన
ప్రజాః ప్రజార్థవ్రత కర్శితాంగం ।
నేత్రైః పపుః తృప్తిమనాప్నువద్భి
ర్నవోదయం నాథమివౌష ధీనాం ॥ 73

పురందర శ్రీః పురముత్పతాకం
ప్రవిశ్య పౌరై రభినంద్యమానః ।
భుజే భుజంగేంద్ర సమానసారే
భూయస్స భూమేర్ధురమాససజ్జ ॥ 74

అథ నయన సముత్థం జ్యోతిరత్రేరివద్యౌః
సురసరి దివతేజో వహ్ని నిష్ఠ్యూతమైశం ।
నరపతి కుల భూత్యై గర్భమాధత్త రాజ్ఞీ
గురుభి రభి నివిష్టం లోకపాలాను భావైః ॥ 75

—*—

సంతానార్థమై వ్రత దీక్షితుడైన రాజు బాగుగా చిక్కిపోయెను. అయినను మునుపెన్నడు ఎరుగని సరిక్రొత్త తేజస్సుతో అతడు వెలుగొందు చున్నాడు. ఇన్నినాళ్ళకు మహారాజునట్లు చూచిన ప్రజలు కృష్ణ పక్షమున దేవతలకు తన కళలను సమర్పించుటతో కృశించి మరల శుక్ల పక్షమున సరిక్రొత్త కాంతితో కనబడు నెలరాజును అనగా చంద్రుని చూచినట్లు చూచుచు ఆ కమనీయ మూర్తిని తృప్తి తీరని తమ కన్నులతో త్రావుచునే యుండిరి. 73

వైభవమున దేవేంద్ర సమానుడైన ఆ దిలీపుడు పట్టణమున ప్రవేశించుచుండగా అతడు పుత్రవంతుడు గాబోవుచున్నాడన్న శుభవార్త నెరిగిన ప్రజలు అతనిని అభినందనలతో ముంచెత్తిరి. ఆ ఆనందాతిరేకమున జెండాలను ఎగురవేయసాగిరి. అట్టివారి మన్ననలను అందుకొనుచు ముందునకు సాగిన దిలీప మహారాజు ఆదిశేషునితో సమానమైన బలముగల తన భుజము పైన భూమియొక్క భారమును మరల ధరించెను. 74

అటుపైన అత్రి నేత్రము నుండి పుట్టిన చంద్రుని ఆకాశము ధరించినట్లు. అగ్నిచే ఉంచబడిన శివతేజమగు కుమారస్వామిని ఆకాశగంగ ధరించినట్లు దిలీపుని వంశాభివృద్ధి కొరకై గొప్పవైన దిక్పాలుర తేజస్సులు ప్రవేశించిన గర్భమును ఆ సుదక్షిణాదేవి ధరించెను. 75

—*—

మానవజాతిని కర్తవ్యోన్ముఖం చేస్తున్న

# శ్రీ కృష్ణస్వామి రచనలు

| | |
|---|---|
| స్వామిగేయాలు | 4-00 |
| దర్శనాలు - నిదర్శనాలు | 3-00 |
| సందేహాలు - సమాధానాలు | 8-00 |
| సంభాషణలు - సమన్వయాలు | 8-00 |
| అన్వేషణ - అనుభూతి | 3-00 |
| అక్షరాల్లో అనుభూతులు | 3-50 |
| అక్షరాల్లో అనుభూతులు 2వ భాగం | 4-00 |
| అక్షరాల్లో అనుభూతులు - 3వ భాగం | 10-00 |
| మానవసేవలో మాస్టర్ ఇ. కె. | 6-00 |
| మాటలు - మంత్రాలు | 7-00 |
| కులపతి కృష్ణమాచార్య | 1-00 |
| భారతం - ధర్మాద్వైతం | 50-00 |
| వాక్కులు - బుక్కులు | 1-50 |
| స్వామి లేఖలు-శాంతిరేఖలు | 6-00 |
| సరసాల్లో నవరసాలు | 6-00 |
| సరసాల్లో నవరసాలు 2వ భాగం | 10-00 |
| స్వామి పలుకులు - స్వాతిచినుకులు | 5-00 |
| మాటల మధ్యలో రాలిన ముత్యాలు | 8-00 |
| పునర్నిర్మాణానికి శంఖారావం | 5-00 |
| నిత్యసత్యాలు - ఆణిముత్యాలు 1వ భాగం | 5-00 |
| కామధేనువు కనికరించినవేళ | 10-00 |
| ఇదీ మన సంస్కృతి - ఇదీ మన సంప్రదాయం | |
| పూజావిధానము - రుద్రాభిషేకము | |